# విన్నపము.



తటుక్కునఁ బుష్పఫలభరితమైనవృక్షంబును భూగర్భబుననుండి యుద్భవింపఁజేసి లోకుల నద్భుతంబున ముంచునైంద్రజాలికునివలె జీవులలో నణఁగిమణఁగియుండుసమస్తశక్తులఁ దక్షణమ వికసింపఁజేయునదియు, గ్రీష్మాతపసంతప్తులై దపిగొన్నపాంథులకు నిర్మలశైత్యనీరంబులఁ బ్రసాదించి శాంతినపాదించువిమలసరోవరంబుభాతిఁ దాపత్రయసంతప్తులైనససారులహృదయదాహంబు శాంతింప నానందనీరంబు నొసంగనదియును, ఎడారిం బడి పోవుచు నెంతదూరము దృష్టిఁ బఱపను సైకతసముద్రంబె కాక మఱెద్దియును గానరానివానికన్నంబునకు నానావిధపత్రపుష్పఫలోపేతం బగునుద్యానవనంబ నేత్రానందంబు సేయుతెఱంగున సారహీనసంసారసాధారణకృత్యంబుల మగ్నులగువారికిఁ బారమార్థికమహాసౌందర్యంబను దృష్టిగోచరము చేయునదియును నై ప్రకాశించునది యొక్కనిశ్చలంబైనభక్తియే యని పెద్దలు చెప్పుచుందురు.

లోకమంతను నొక్కకుటుంబముగ నెంచి మానవహృదయక్షేత్రంబున నీభక్తిబీజంబును నాటుటకై తమకుఁ బరమేశ్వరుఁడు ప్రసాదించిన కవిత్వాదిసమస్తశక్తుల నుపయోగించ

ఎన్నిరాచకార్యములలో మనంబు మగ్నంబైయుండినను ప్రధానేంద్రియం బగునేత్రేంద్రియము బాధింపఁబడుచుండినను లెక్కసేయక తమయమూల్యమైనకాలంబును గొంత నొసంగి నాయీగీతాంజలిని జాలవఱకుఁ బరిశీలించిన మన్మిత్రు లగు బ్రహ్మశ్రీ మ. రా. శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడు పంతులు గారికిని, నత్యల్పకాలమున సర్వోత్తమంబుగ నిప్పొత్తంబును ముద్రించి యిచ్చిన శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాశాలాధికారులకును నేనెంతయుఁ గృతజ్ఞతాపూర్వకవందనముల సమర్పించుచున్నాఁడను.

పిఠాపురము.
23-9-1913.

ఇట్లు విన్నవించు
సజ్జనవిధేయుఁడు,
ఆదిపూడి సోమనాథరావు.

# అంకితము.



గీ. ఆసియాకవిసార్వభౌ ♦ మాంక మంది
యమరుచుండు రవీంద్రనా ♦ థాఖ్యసుకవి
కంజలిని గూర్చి యతని గీ ♦ తాంజలికిని
దెలుఁగుగీతాళిఁజేసితి ♦ సులభశైలి.

గీ. భక్తగణములపాలిటి ♦ పారిజాత
మైనపరమేశ్వరున కిది ♦ యంకితముగ
నొసఁగితినిగాన రవిసోము ♦ లుండుదాఁక
నతని దయచేతఁ దిరమయి ♦ యలరుఁగాత.

# గీతాంజలి.

## 1

అంతరహితునిగా నన్ను ♦ నలరఁ జేసి
మాటిమాటికి బోర్లించి ♦ మరల నూత్న
ప్రాణమును నింతు వీక్షుద్ర ♦ పాత్రయందు
నీకటాక్షంబుచేత లో ♦ కైకనాథ !
కొండకోనల నీపిల్లఁ ♦ గ్రోవియందు
నూతనానందమధురసం ♦ గీతములను
నూఁదుచుందువు మిగుల వి ♦ నోదముగను
నీకటాక్షంబుచేత లో ♦ కైకనాథ!
అమృతకరముల నీవు న ♦ న్నంటఁ గానె
హర్షమునఁ బొంగి నామది ♦ యాపఁగాని
వాక్సుధాపూరములఁ గొల్పు ♦ వక్త్రమందు
నీకటాక్షంబుచేత లో ♦ కైకనాథ !
కురియుచుందువు నాచిన్న ♦ కరములందె
యెంతకాలము చన్న న ♦ నంతవరము ;
లెంతఁగుఱిసిన నవకాశ ♦ మింక నుండు
నీకటాక్షంబుచేత లో ♦ కైకనాథ !

## 2

పాడు మనునాజ్ఞ నీచేతఁ ♦ బడసినపుడు
గర్వభరమున నెద విచ్చు ♦ కరణిఁ దోఁచు;
నంత నాదృష్టి నీముఖ ♦ మందుఁ బఱపఁ
గనుల నానందపూరముల్ ♦ గ్రమ్మి పాఱు.
జీవితములోనిద్వంద్వముల్ ♦ చెఱఁగి కరఁగి
యొక్క రమ్యశుభాకృతి ♦ నొంది యొప్పఁ;
బక్షములు విచ్చుఁ బూజ్యభా ♦ వంబు పొదలి
యబ్ధి దాఁటంగ నెగయు వి ♦ హంగమట్లు.
నాదుగానంబు నీకు నా ♦ నంద మంచు
దేవ! నీసన్నిధిని నేను ♦ సేవలంబు
గాయకుఁడఁ గాని వే ఱేమి ♦ గానటంచుఁ
దేటముగ మదిలోపలఁ ♦ దెలియవచ్చు.
అలరెడుమదీయగీతప ♦ క్షాంచలమున
నందగాఁ గాని నీదుపా ♦ దాబ్జ మంటి
గానరస మాని మది చొక్కఁ ♦ గాంచియుంట
విభుఁడ వగునిన్ను సఖుఁ డని ♦ పిలుతు మఱచి.

## 3

ఎట్టిదో నాథ! నీగాన ♦ మే నెఱుంగ;
నిరత మాలింతు నాశ్చర్య ♦ భరితుఁడగుచు;

నీదుగానంబు వెలిఁగించు ♦ నిఖిలజగము ;
నీదుగానానిలం బాడు ♦ నింగిఁ జెలఁగి ;
నీదుగానాచ్ఛవాహిని ♦ నిఖిలశైల
వప్రములఁ వ్రిచ్చి పఱచు ని ♦ ర్వక్రగతిని.
పాడ నీతోడ నామది ♦ వలచుఁ గాని
తగినకంఠస్వరము లేమిఁ ♦ దల్లడిల్లుఁ ;
గడఁగి భాషింప గానంబు ♦ గాదు గాన
" నతులభవదీయగానజా ♦ లాంతరమున
నాదుమదిఁ జెఱఁగొంటి వో ♦ నాథ ! " యంచు
నఱతు నెగ్గెత్తి నేను ని ♦ రాశఁ జెంది.

**4**

నాదుప్రాణంబునకును బ్రా ♦ ణంబ వైన
నీవు సర్వాంగ మంటు స ♦ జీవుఁడంచుఁ
దెలిసి, నిర్మలముగ నాదు ♦ దేహముంప
జతన మొనరింతు శక్తి వం ♦ చనము లేక.
బుద్ధిదీపంబు మన్మనం ♦ బున నమర్చు
నట్టి సత్యస్వరూపుఁ డీ ♦ వంచు నెఱిఁగి
తలఁపులోనుండి యనృతముల్ ♦ తొలఁగఁ జేయ
జతన మొనరింతు శక్తి వం ♦ చనము లేక.
హృదయకుహరాంతరంబు స ♦ ర్వేశ ! నీకుఁ

నీతిగ నెఱింగి ప్రేమపు ♦ ష్పింపఁ జేసి
నెఱియు హృద్దోషముల నెల్లఁ ♦ దఱిమివైవ
యత్న మొనరింతు శక్తివం ♦ చనము లేక.
కార్య మొనరించుటకు నయి ♦ కలుగుబలము
పొడము నీశక్తిచే నని ♦ బుద్ధిఁ దెలిసి
ప్రకటపఱుపంగ నిన్ను నా ♦ పనులయందు
యత్న మొనరింతు శక్తివం ♦ చనము లేక.

5

ఒక్కనిముసంబు నీప్రక్క ♦ నుండుచనువుఁ
గోరితిని దయసేయు ము ♦ దారమతిని;
బిన్నగ నొనర్తు నావల ♦ నున్నపనుల
సుందరం బగునీమోముఁ ♦ జూడనేని
మదికి శాంతియు విశ్రాంతి ♦ మాయమగును;
నాదుశ్రమ మెల్ల నింతయు ♦ మోద మిడక
పారమే లేనిబహుకష్ట ♦ వార్ధిలోని
తుదిమొదలు లేనికృషిఁబోలెఁ ♦ దోఁచుచుండు.
వెచ్చనూర్పుచు గొణుఁగుచు ♦ వచ్చి నిలిచె
బాలకముకడ నేఁడు వే ♦ సంగిప్రోడ;
రమ్యపుష్పవనాస్థాన ♦ రంగమందు
గాన సభలను గొల్పుచుఁ ♦ గ్రావెనళులు

శాంతితోఁ బొంగు నిట్టివి ♦ శ్రాంతివేళ
నీముఖాముఖిఁ గూర్చుండి ♦ నిశ్చలముగఁ
బ్రాణ మంకితముగ నిడు ♦ పాటఁ బాడ
నెంతయును యోగ్యసమయమై ♦ యెసఁగుఁ గాదె?

## 6

ఈసుమము జాగు సేయక ♦ కోసి కొమ్ము
ఆలసించిన దుమ్ములో ♦ రాలుఁ జుమ్ము
నెలవు దీనికి నీదండఁ ♦ గలుగ దేని
త్వత్కరస్పర్శబాధచే ♦ సత్కరించి
కోసి కొ ; మ్మాలసింపక ♦ కోసి కొమ్ము.
బాగుగా నాకు మెలఁకువ ♦ వచ్చులోనఁ
బ్రొద్దుపోవునొ ముగియునో ♦ పూజవేళ
యంచు భయపడుచుంటి ; నా♦కభయ మిచ్చి
కోసి కొ ; మ్మాలసింపక ♦ కోసి కొమ్ము.
అంతగా రంగు లేకున్న ♦ నల్పముగను
బరిమళం బున్న నిప్పువ్వు ♦ ప్రభువతంస
స్వీకరింపుము భవదీయ ♦ సేవకొఱకుఁ ;
దప్పి పోకుండఁ దరుణంబు ♦ దయ దలిర్పఁ
గోసి కొ ; మ్మాలసింపక ♦ కోసి కొమ్ము.

## 7

నామగానాంగన దొలంగె ♦ నగల నెల్ల ;
వస్త్రభూషణగర్వ మ ♦ ప్పుడఁతి పడదు
భూషలం గల్గునన్యోన్య ♦ మునకు హాని
నాకు నీ కవి యడ్డమై ♦ నడుమ నిలుచు
రణితమున మున్గునీగూఢ ♦ రమ్యవాణి.
నీవు తల యెత్తి చూచిన ♦ నిలువలేక
నాదుకవిదంభము నశించు ♦ నానచేతఁ ;
గవులకెల్లను నాథుఁడై ♦ కా[illegible]లుదేవ !
నీదుపాదాబ్జములకడ ♦ నిలిచినాఁడ ;
నీవు రమ్యస్వరంబుల ♦ నింపి పాడ
వేణు వగురీతి నాదుజీ ♦ వితము నేను
జల్పుదును గాక సరళముఁ ♦ సాధువుగను.

## 8

కంఠమునఁ దారహారాది ♦ కములఁ దాల్చి
యొడలిపై రాజవస్త్రంబు ♦ లొప్పుచుండు
బాలుఁ డాటలసౌఖ్యంబుఁ ♦ బడయఁ గలఁడె ?
ఆడఁ గడఁగినయపు డెల్ల ♦ నతనియుడుపు
లడ్డముగ వచ్చి యాతని ♦ నాఁపుచుండుఁ ;

జిన్గునో మాయునో యను ♦ చింత చేతఁ
దాను జనులకు దూరమై ♦ తలఁగు చుండు ;
వేడ్కఁ దిరుగాడుటకుఁ గూడ ♦ వెఱచు చుండు.
సౌఖ్య మొసఁగెడుభూమిర ♦ జంబునుండి,
జనసమూహము లనుగొప్ప ♦ సంతలోన
వేడ్కఁ దిరుగాడఁగాఁ గల్గు ♦ స్వేచ్ఛనుండి,
దూరముగనుంచి తళతళ ♦ ద్యుతుల నీను
బాలురకు నీవు పెట్టిన ♦ బంధనములు
నిష్ఫలంబులు ; మాతరో ! ♦ నిష్ఫలములు.

9

ఓరి మూర్ఖుఁడ ! నీదుబా♦హువులమీఁద
నిన్నుఁ గొంపోవ నీవు య♦త్నించినావె ?
నీదువాకిట బిచ్చంబు ♦ నీవె యెత్త
వచ్చినాఁడవె ? భిక్షుకా ! ♦ వచ్చినావె ?
సకలభారంబు వహియింపఁ ♦ జాలినట్టి
ప్రభుకరమ్ములఁ బెట్టుమీ ♦ భారమెల్ల.
దృష్టి వెన్కకుఁ ద్రిప్పి చిం♦తిల్లఁ బోకు.
తాను ముట్టినదీపముఁ ♦ దత్క్షణమున
నూఁది యార్పును ; నీయాశ ♦ యుర్వెలోన
మలిన మది ; దానిచేతుల ♦ వలన నీవు

గానకు మేవరమైనను ♦ గానకు కానకు.
శుద్ధప్రేమాస్పదుం డైన ♦ శుభుఁ డొసంగు
దానినే స్వీకరింపుము ♦ ధన్యుఁ డగుము.

## 10

బీద సాదల పతితుల ♦ విడుదులందె
నీదుపాదారవిందముల్ ♦ నిలిచి యుండుఁ;
గాన నచ్చట నెప్పుడుఁ ♦ గ్రాలుచుండు
నీదుపదపీఠ మెంతయు ♦ నిశ్చలముగ.
బీద సాదల పతితుల ♦ విడుదులందు
నిలిచి యుండెడు నీపాద ♦ నీరజములు
నీకు మ్రొక్కంగ భక్తి య♦త్నించునాకు
నందరానంతలోఁతున ♦ నలరు దేవ!
బీద సాదల పతితుల ♦ వెంటవెంటఁ
గంతబొంతలఁ దాలిచి ♦ కరుణతోడ
నరుగుచుండెడునట్టి యో ♦ పరమపురుష!
గరువ మెప్పుడైన నీకడ ♦ కరుగఁ గలదె?
సఖులు లేనట్టివారికి ♦ సఖుఁడ వగుచు
బీద సాదల పతితుల ♦ వెంటవెంట
నుండి ప్రేమాస్వరూపివై ♦ యొప్పునిన్నుఁ
జేరఁగారాదు నాథ! నా ♦ చిత్త మెప్పుడు.

## 11

జపతపంబులు గానముల్ ♦ చాలుఁ జాలు ;
నన్నితలుపులు మూసి యీ ♦ యాలయమునఁ
జిమ్మచీఁకటిగొందిలోఁ ♦ జేరి యిట్టు
లొంటి నెవ్వని బూజించు ♦ చుంటి విపుడు ?
తెఱచి కన్నులఁ జూడుము ♦ దేవుఁ డెదుటఁ
గానవచ్చునో లేదో నీ ♦ కన్నులకును.
గట్టియౌభూమి దున్నెడు ♦ కాఁపువాఁడు
కూలికై త్రోవఁ గంకరఁ ♦ గొట్టువాఁడు
కష్టపడుచోట నాతఁడు ♦ గలఁడు ; చూడు !
దుమ్ము తనవస్త్రములమీఁదఁ ♦ గ్రమ్ముచుండ
నెండవానలలో వారి ♦ దండ నుండు;
నతనివలె శుభ్రవస్త్రంబు ♦ నవలఁ బెట్టి
దుమ్ములోనికి నీవును ♦ రమ్ము! రమ్ము.
మోక్షమా ? చూడు మద్ది యే♦మూలఁ గలదో
నాథుఁడునుగూడ సృష్టిబం♦ధమ్ముఁ దాను
బూని యున్నాఁడు సంతోష ♦ పూర్వకముగ ;
విడక మనలోన బద్ధుడై ♦ వెలసినాఁడు.
ధూపదీపాదులను బెట్టి ♦ దూరమందు
వెలుపలికి రమ్ము ధ్యానంబు ♦ వీడి నీవు ;

నలిగినీవస్త్రములు మాయ ♦ నష్ట మేమి?
చెమట నుదుటను బట్టంగ ♦ శ్రమ యొనర్చి
దర్శనముఁజేసి యాతని ♦ దండ నిలుము.

## 12

ఆచరింపంగ నేఁ బూని ♦ నట్టియాత్ర
చాల దూరమ్ము; కాలమ్ము ♦ చాలఁ బట్టుఁ;
దొలివెలుఁగుఁ దేరిపై నెక్కి ♦ త్రోవఁ దీసి
యుడుగ్రహమ్ములలో జాడ ♦ లునిచియునిచి
చనితి సకలజగంబు లట ♦ వనులఁ బట్టి.
ఇట్లు నిన్ను సమీపింప ♦ నిచ్చుత్రోవ
యెంతయును దీర్ఘతరమయి ♦ యెసఁగుచుండు.
సాధుతమశాంతజీవన ♦ సాధనంబు
దుర్గమంబు దురూహ్యంబు ♦ దుస్సహంబు.
యాత్రికుఁడు తనవాకిటి ♦ కరుగులోనఁ
బ్రతిపరకవాటమును దట్ట ♦ వలసి నట్టు
లంతరాంతరమందిర ♦ మంతమందు
నరుగ వెలిజగములనెల్లఁ ♦ దిరుగ వలయు.
కనుల నే మూసి "ఇదిగో నీ" ♦ వనెడులోన
నెంతయోదూరముగ నశ్రు ♦ లేగి వచ్చె.
"హా! యెచట నుంటి వీ" వను ♦ నట్టిప్రశ్న

యశ్రుతటినీసహస్రమై • యట్టె కరఁగి
“ఉంటి నే నిదె” యనియెడు • నుత్తరంపు
వరదమై ముంచె జగములఁ • బ్రిళ్యము మట్లు.

## 13

పాడఁగా వచ్చినట్టినా • పాట నేను
నేఁటివఱకును బాడంగ • నేరనైతిఁ;
దంతు లెగఁదిగఁదిప్పుచుఁ • దంబురకును
లలిని శ్రుతిఁ గూర్చుటందె కా•లంబు గడచెఁ;
దరుణ మింకను రాలేదు • తథ్య మరయఁ;
బొందికగ శబ్దములకూర్పు • పొసఁగలేదు;
ఆశమాత్రము బాధించు • నాత్మయందు ;
గాలి నిట్టూర్పువిడుచుట • గలిగెఁ గాని
వేడ్కగా విరిమాత్రము • విచ్చలేదు;
చేరి యతనిముఖాబ్జ మీ • క్షింపలేదు;
లీలఁ దత్కంఠనాద మా • లింపలేదు;
గృహమునకు ముందు వీథిలో • నేగునతని
కాల్సడిమాత్ర మేవినఁ•గంటిఁ జెవిని;
అతఁడు గూర్చుండుటకుఁ దగు • నాసనంబు
పఱచుటందె గతించె నా • బ్రతు కిదెల్ల.
గృహములో దీప మింక వె • లిగింపలేదు;

ఎట్లు రమ్మంచుఁ బిలుతుఁ బ్రా ♦ ణేశు నిటకుఁ;
గాని యాతని నొకనాఁడు ♦ గలిసికొందు
ననెడుపేరాసతో నేను ♦ మనుచు నుంటిఁ
గలుగలే దింక నే వానిఁ ♦ గలిసికొనుట.

## 14

నాదుకోర్కులు వేనవేల్ ♦ నాప్రలాప
మెంతయో జాలిఁ గొల్పెడు ♦ నెవని కయినఁ;
గాని కాపాడితివి నన్నుఁ ♦ గఠినమతిని
బ్రార్థనల నెల్ల నీవు ది ♦ రస్కరించి
యిట్టి ప్రబలానుకంపంబు ♦ నెన్నిమార్లో
నాదుజీవితమునఁ జూపి ♦ నావు నీవు.
అధిప! యత్యాశచేఁ గల్గు ♦ నార్తినుండి
నన్నుఁ గాపాడి పరమేశ ♦ నాఁడునాఁట
నడుగకయె నాకు నొసఁగిన ♦ యతులసరళ
వరము లగు మానసమునకుఁ ♦ బ్రాణమునకు
దేహమున కాకసమునకుఁ ♦ దేజమునకు
నెంతయును యోగ్యునిగఁ జేసి ♦ యొసఁగుదీవు.
నాకుఁ బరమావధివి గాన ♦ నాథ! నిన్నుఁ
గరము మెలఁకువ నొక్కమా ♦ ఱరయుచుందు;
మెలఁకువను దక్కి యొకమాఱు ♦ మెలఁగుచుందుఁ

గాని నీ వేలొకో దాఁగి ♦ కానరావు.
తఱచుగా నాదుకోర్కెలఁ ♦ దలఁగఁద్రోసి
చపలదుర్బలవాంఛచే ♦ సంభవించు
నాపదలనుండి రక్షించి ♦ యధిప! నన్నుఁ
బూర్ణవిశ్వాసపాత్రుఁగాఁ ♦ బొదలఁజేసి
నెమ్మితో నన్నుఁ గరము మ ♦ న్నించినావు.

15

నిన్నుఁటించిన గీతముల్ ♦ నేర్చి పాడ
నిచట నున్నాఁడ జగముల ♦ నేలుఱేఁడ!
భవ్యతర మగునీదివ్య ♦ భవనమందు
మూాల నొకచోటు నాకును ♦ బొలుచుచుండు.
ఇజ్జగంబున నాకుఁ బ ♦ నేమి లేదు.
విఫలమై యుండునాదుజీ ♦ వితము గాన
నిర్విషయగీతములె పాడ ♦ నేర్చియుండు.
మానముగ నిన్నుఁ బరమేశ! మధ్యరాత్రి
యనెడునయ్యంధకారాల ♦ యంబునందుఁ
బూజ సల్పుటకయి గంట ♦ మ్రోగునపుడు
నీయెదుట నిల్చి పాడఁగా ♦ నెమ్మితోడ
నాకు నాజ్ఞనొసంగుమ ♦ నాథనాథ!
భాసురంబుగ నొప్పపరి ♦ భాతమందు

సందమగుస్పైఁడివీణియ ♦ యందు శ్రుతిని
హాయిగాఁ గూర్చినప్పుడు ♦ హర్షముననుఁ
నీదుసన్నిధి నొసఁగి మ ♦ న్నింపుమయ్య!

16

అమలసౌభాగ్య జగదుత్స ♦ వమున కేను
బిలువఁబడితిని బరమసం ♦ ప్రీతితోడ;
ధన్య మయ్యెను నాజీవి ♦ తమ్ము నేఁడు;
కనులపండువుగా నెల్లఁ ♦ గంటిఁ గంటి;
విందుగా వీనులకు నెల్ల ♦ వింటి వింటి;
నొప్పుగా నాదు వాద్యమీ ♦ యుత్సవమున
నెలమి వాయించుపని నాకు ♦ నీయఁబడియె;
శక్తివంచనలేక నే ♦ సలుపఁగంటి;
నెమ్మితో లోపలికిఁ బోయి ♦ నిన్నుఁ జూచి
"నెమ్మదిగ భక్తితో వంద ♦ నమ్ము సలుపు
సమయమా" యని యడిగెద ♦ స్వామి నిపుడు.

17

కడకు నాతనికరములఁ ♦ బడఁగ నెంచి
వేచియున్నాఁడఁ బూజ్యమౌ ♦ ప్రేమకొఱకు
నేను జేసిన జాగెల్ల ♦ దానికొఱకె

చేయవలసినపనులను ♦ జేయకుండు
తప్పిదముఁ జేసి యుంటయు ♦ దానికొఱకె.
కట్టుదిట్టములను నన్నుఁ ♦ గట్టివేయ
వచ్చుచున్నారు వారల ♦ వశముగాను
వేచియున్నాఁడఁ బూజ్యమా ♦ ప్రేమకొఱకుఁ
గడకు నాతనికరములఁ ♦ బడఁగ నెంచి.
మందుఁడా యని నిందింతుర్ ♦ మహిని బ్రజలు
జనులవాక్యంబు నిజము ని ♦ స్సంశయంబు;
సంతబేరము లన్నియు ♦ శాంతమొందెఁ
బనులతొందర గలవారి ♦ పనులు ముగిసెఁ
బిలిచినఁ బోక నే నున్న ♦ నలిగినారు
పిలిచి మరలిన వారలు ♦ ప్రీతిఁ దొఱఁగి;
కడకు నాతనికరములఁ ♦ బడఁగ నెంచి
వేచియున్నాఁడఁ బూజ్యమా ♦ ప్రేమకొఱకు.

18

కమ్ముకొని పయిఁబయిని మే ♦ ఘములు వచ్చెఁ
గడలనెల్లను జిమ్మచీఁ♦కటులు గ్రమ్మె
నొంటిగా బైటవాకిట ♦ నుంతువేల
యొంటిగా బైటఁ బ్రేమమా ♦ యుంతు వేల?
బనులతొందర గలపట్టు ♦ పగటియందుఁ

ప్రజలతోఁ గూడి చక్కఁగాఁ ♦ బాటుపడితిఁ
గాని యీయొంటిగాఢాంధ ♦ కారవేళ
యందు నాకున్న దెల్ల నీ♦యాశ యొకటె.
వదనకమలముఁ జూపి స♦మ్మదము నిడక
ప్రేమమా నీవు నన్ వెలి ♦ వేసితేని
దీర్ఘమైనట్టి యీవర్ష ♦ దినము నెట్లు
గడపఁగల్గుదునో నాకుఁ ♦ గానరాదు.
దూరముగ నాకసంబునఁ ♦ దోఁచుదమము
నంటె నాదృష్టి నంతను ♦ బొందుపఱతు;
శాంతి సుంతయు లేక సం ♦ చలత నొందు
వాతమునఁ బడి నామది ♦ వంతఁ దిరుగు.

## 19

ఈవు మాట్లాడలేనినా ♦ హృదయమందు
మౌనమును జక్కఁగా నింపి ♦ దాని నోర్తుఁ
దలను నోపిక వంచి చు ♦ క్కలనుగూడి
జాగరంబుండు రాత్రిరి ♦ చండ మంది
యెంతయును వేచియుండుదు ♦ శాంతముగను;
వచ్చుఁ దప్పదు నిజముప్రి ♦ భాతవేళ
చిమ్మచీఁకటి యంతయుఁ ♦ జెదరిపోవు.
ఆకసముఁ జీల్చుకొనుచునీ ♦ యమలవాణి

స్వర్ణతటినీసహస్రంబు ♦ పగిది డిగ్గు;
నంత నొక్కొక్కనాగూఁటి ♦ యందు నీదు
కలికిపలుకులు గీతప♦ఙ్క్తులఁ దాల్చు;
నీవిమలమంజుగీతముల్ ♦ నావనమ్ము
లందుఁ బుష్పాకృతులఁ దాల్చి ♦ యలరఁజొచ్చు.

20

అంబుజాతము వికసించి ♦ నట్టివేళ
నకట! నామది యెచటికో ♦ యరిగియుండెఁ
గానఁ దెలియంగ నైతిని ♦ దాని నేను.
పుష్ప మొకటియు లేకుండెఁ ♦ బుట్టియందు
నైన నప్పువ్వుపై దృష్టి ♦ యరుగదయ్యెఁ;
గాని నన్వేత పలుమాఱు ♦ కలఁపఁజొచ్చెఁ;
నంత మేల్కాంచి కాంచితి ♦ వింతయైన
పరిమళముఁ జాడ దక్షిణ ♦ వాతమందు;
నాపఁగాఁగాని యపరిమి ♦ తాశఁ గొలిపి
మదిని వేధించునప్పరి ♦ మళలవంబు.
నిండుదనమును వెదకుచు ♦ నుండుగ్రీష్మ
ఋతువు తమిఁ బుచ్చు నూపిరి ♦ రీతిఁ దోఁచెఁ;
గాని యిది యింతదగ్గఱఁ ♦ గ్రాలె ననియు,
మఱియు నిది నాది యనియును ♦ మన్మనమునఁ

దద్దయు గభీరతరమైన ♦ తలమునందుఁ
బూర్ణమాధుర్య మిది పూచి ♦ పొలిచె ననియుఁ
దెలియలేనైతి నప్పుడు ♦ తెలియనైతి.

## 21

ఇడఁగవలయును నేను నా ♦ పడవ నీట;
నూరకే యెట్టులుండుట ♦ యొడ్డుమీఁదఁ?
గటకటా! యెంతకాలంబుఁ ♦ గడపవలయుఁ?
బూచి చిగిరింపఁగాఁజేసి ♦ పోయె మధువు;
బొత్తిగా నెండిపోయిన ♦ పూలమోచి
వేచియున్నాఁడఁ జూచుచు ♦ వెనుకముందు;
నలలఘోషంబు లెంతయు ♦ నధిక మయ్యె;
జలధితీరపునీడల ♦ సందునుండి
యిలను బటపటఁ బండుటా ♦ కులును రాలె.
శూన్యమం దేమి చూచెదు ♦ చూడ్కి నిలిపి?
అదిగో! దూరాన నాతీర ♦ మందునుండి
తేలివచ్చెడుగీతితో ♦ గాలిలోనఁ;
జొచ్చుకొని వచ్చుకంపముఁ ♦ జూడలేవె?

## 22

శ్రావణములోని గాఢఘన ♦ చ్ఛాయలందు

రేయి నిశ్శబ్దమై యుండు ♦ రీతినుండి
యెల్లకావలివారల ♦ నేమఱించి
యడుగుపై నడుగిడుచు ర ♦ హస్యముగను
సంచరించుచు నుందువు ♦ స్వామి ! నీవు.
పూర్వవాయువుతా నెంత ♦ పూన్కితోడ
నఱచి పిలుచుచునుండిన ♦ సరకుగొనక
నేఁటివేకువ మోడిచె ♦ నేత్రములను.
నీలమును మించునిచ్చలు ♦ మేలుకాంచు
నాకసముమీఁద దట్టమై ♦ యమరె ముసుఁగు;
గానములసద్దు నణఁచెను ♦ గాననములు;
ప్రతిగృహకవాటమును మూయఁ ♦ బడెను; గాని
నిర్జనంబైనవీథిలో ♦ నీ వొకఁడవె
పాంథ ! తిరుగుచున్నావు ♦ భయములేక.
ఓ మదీయైకసన్మిత్ర ! ♦ యో మదీయ
ప్రియతమప్రాణనాథ ! నా ♦ గృహమునందుఁ
దెఱవఁబడె నన్నితలుఁపులు ♦ దేవ ! నీవు
వచ్చి స్వప్నంబుకైవడి ♦ వలదు చనఁగ.

23

ఈ మహావర్షరాత్రిలో ♦ నెలమితోడఁ
బ్రేమఁ జూపెడుయాత్రకై ♦ వెడలినావె ?

యాశలెల్లను భంగ మై ♦ నట్టిదాని
వలెను గగనంబు మూల్గు నో ♦ ప్రాణమిత్ర!
నిద్ర వచ్చుట యెక్కడ! ♦ నేఁటిరాత్రిఁ;
దీసి తలుపులు పలుమాఱుఁ ♦ దీసి తీసి
చూచినకొలందిఁ జీఁకటే ♦ చూడ నయ్యెఁ;
గానఁబడ దేమియును ముందుఁ ♦ గానఁబడదు.
ఎద్ది నీమార్గ మద్భుతం ♦ బెచట నుండు?
నల్లని మషీజలమ్ముల ♦ వెల్లు వట్లు
తనరు నేనీలవాహినీ ♦ తటమునుండి
తద్దయును గోపభావంబుఁ ♦ దాల్చి పొల్చి
నల్లఁబాఱిన యేవనాం ♦ తమ్ము నుండి
యేమహాగాఢనీలాధ్వ ♦ సీమనుండి
వచ్చినాఁడవు? నాకడ ♦ వచ్చినావు.

24

నిద్రచేఁ గప్పి భూమిని ♦ నెమ్మితోడ
సంజఁ దూలుచు నుండెడు ♦ సారసంపు
ఱేకులను మూయుచుందు లో ♦ నైకనాథ!
పగలు చనెనేని బక్షులు ♦ పాడవేని
గాలి బడలికచేఁ గుంది ♦ కదలదేని
నాపయినిగూడఁ గప్పుము ♦ నాథ! యిపుడు

గ్రాల ముసుఁగుగ గాఢాంధ ♦ కారపటము.
భోజనపదార్థములు యాత్రి ♦ ముగియులోన
ముగిసియున్నట్టి పుట్టముల్ ♦ మిగుల మాసి
చినిఁగి యున్నట్టి బడలికఁ ♦ జెందినట్టి
యాత్రికునిలజ్జలేముల ♦ నపనయించి
త్వద్దయారూపరాత్రి యగ ♦ దండ మొసఁగి
మరల నలరంగఁ జేయుము ♦ విరినిబోలె.

25

బడలుటగ రాత్రి శ్రమలచే ♦ గడపకుండ
నాదువిశ్వాసభరము నీ ♦ మీఁదఁ బెట్టి
హాయిగా నిద్రఁ జెంది న ♦ న్నలరనిమ్ము
నీకటాక్షంబుచే జగ ♦ దేకనాథ!
పూజ్యతర మైనభవదీయ ♦ పూజయందు
శల్పయత్నముతోడినా ♦ యలసినట్టి
యాత్మ పురికొల్పకుండ నా ♦ కాజ్ఞ నిడుము
నీకటాక్షంబుచే జగ ♦ దేకనాథ!
పగలు బడలినకనులు ప్ర ♦ భాతవేళఁ
దిరిగి సంతోషభరమునఁ ♦ దేజరిలఁగ
వాన్నిపై రాత్రి యను ♦ మూఁత వైతు వీవు
నీకటాక్షంబుచే జగ ♦ దేక నాథ!

## 26

అతఁడు వేంచేసి నాయొద్ద ♦ నలరుచుండెఁ;
గాని మూర్ఖత నేను మే ♦ ల్కాంచనయితి.
ఇంతపాపిష్ఠినిద్రి నా ♦ కేలఁ బట్టె;
నెంతదౌర్భాగ్యవంతుఁడ! ♦ నెంత జెడుఁడ!
స్వామి దయచేసె రాత్రి ని ♦ శ్శబ్దవేళఁ;
జేతులను వీణ యెంతయుఁ ♦ జెలఁగు చుండె;
వరమనోహరతన్మృదు ♦ ధ్వనుల చేతఁ
బ్రతిరవము లీనఁజొచ్చెనా ♦ స్వప్నములను.
ఏల నశియించె నారాత్రు ♦ లివ్విధమున?
నెవనియూపిరి నానిద్రి ♦ నెలమినంటు
సతనిదృష్టికి నే నిట్టు ♦ లనవరతముఁ
దప్పిపోవుట యేలొకో ♦ చెప్పఁ జాల.

## 27

దీపమా? యెడ నున్నది? ♦ దీపమేడ?
దానివెలిఁగించు మందు నా ♦ శానలంబె!
జ్వాలయే లేదు దీపంబు ♦ వలన నేమి?
హృదయమా! నీదుగతియెల్ల ♦ నింతయేని
మృత్యువే దీనికంటెను ♦ మేలు నీకు.

నీతలుపుఁ గష్టదేవత ♦ నిలిచి తట్టె;
స్వామి మేల్కాంచి సంకేత ♦ సదనమునకుఁ
జిమ్మచీఁకటి రాత్రిలో ♦ రమ్మటంచుఁ
బుచ్చుసందేశమును నీకుఁ ♦ దెచ్చెనదిగో!
ఆకసంబున మేఘంబు ♦ లట్టె క్రమ్మె
యెడ తెరపిలేక ధారగా ♦ వృష్టి గురిసె;
నేదియో నన్నుఁ బురికొల్పె ♦ నెఱుఁగ లేను;
దీనియర్థం బదేమియో ♦ దెలియఁ జాల
నిముసమున మించి మెఱపు నా ♦ నేత్రదృష్టి
గాఢతమ మైనతమములో ♦ గాడఁ ద్రోసె.
రాత్రి చేసెడిగానమ్ము ♦ రమ్మటంచుఁ
బిలుచు; నాదారి నామది ♦ వెదకు చుండె
దీపమా? యెడ నున్నది ♦ దీప మేడ?
దానివెలిఁగించుమందు నా ♦ శానలంబె!
ఉఱుముచున్నది; జోరని ♦ యోరుగాలి
విసరికొనిపోవు చున్నది ♦ వింటి యందు;
రాత్రియున్నది నల్లని ♦ ఱాతిరీతిఁ;
గడవకుండును గాక నా ♦ కాలమెల్ల
గాఢమైనట్టి యీయంధ ♦ కారమందె.
ప్రేమ యనుదివ్వె నీదుజీ ♦ వితముచేత
జాగుచేయక వెల్గించి ♦ బాగుపడుము.

## 28

తెగకయున్నవి వలయురుల్ ; ♦ ద్రెంపఁ గడఁగ
నెంతయును నొప్పిగలుగు నా ♦ హృదయమునకు
నేను వలచినదంతయు ♦ స్వేచ్ఛయొకటె ;
కానిసిగ్గగుచున్నది ♦ దానిఁగోర
నాకుఁ దెలియును నీవు ర ♦ త్నాలగనివి ;
నే నెఱుంగుదు నిన్ను స ♦ న్మిత్రమంచుఁ;
గాని నాగదిలో నిండి ♦ క్రాలుచుండు
వట్టియాడంబరంబులఁ ♦ బారవైవ
హృదయ మొప్పక యున్నది ♦ యించుకైన;
తొడిగి యున్నట్టిపుట్టమ్ము ♦ దుమ్ము వమ్ము.
ఎంతయిష్టమ్ము లేకున్న ♦ నెలమితోడ
విడువలేకుండ దానినే ♦ తొడుగు చుందుఁ;
దప్పు లొప్పులుఁ గల వెన్నొ ♦ చెప్పజాలఁ;
దెలుపఁ గూడని వెన్నియో ♦ గలవు చాల ;
నైన నామంచికై నిన్ను ♦ నడుగ వచ్చి
యెంతువో విన్నపం బని ♦ యెదఁ జలింతు

## 29

నే నిడిననాదునామంబు ♦ లోనివాఁడు

గుందుచున్నాఁడు చింత ని ♦ గ్గొందిలోనఁ;
జుట్టు నీగోడఁ గట్టగాఁ ♦ జొచ్చినాఁడఁ;
బెరిఁగి యిది నాఁడునాఁటికి ♦ వింటినంట
మన్నిజస్థితి తచ్ఛాయ ♦ మఱుఁగు వడియె.
గర్వపడుచుందు నీగోడఁ ♦ గాంచి కాంచి;
కన్న మేదియు దీనిలోఁ ♦ గలుగకుండఁ
బొందుగా మట్టితోఁ బూఁతఁ ♦ బూయుచుందు ;
నింత మెలఁకువఁ బనిచేసి ♦ యంతమందు
మన్నిజస్థితినే నేను ♦ మఱచిపోదు.

## 30

నాదుసంకేతమునకు నే ♦ మోద మొప్ప
నొంటిఁగా బైలుదేరితి ♦ నొంటిగానె;
కాని చీఁకటిలో నాఁకు ♦ గాఁన బడక
వెంటనంటెను మెల్లఁగా ♦ వీడెవండొ.
తప్పుకొనుటకు నటునిటుఁ ♦ దలఁగు చుందుఁ;
గాని తప్పించుకొననైతి ♦ వీనినుండి.
దుమ్ము రేఁపును వీఁడు దం ♦ భమ్ము లాడి;
వానికేకను నాప్రతి ♦ వాక్యమందుఁ
గూర్చుచుందును దాను సం ♦ కోచపడక;
నాథ! వీఁ డెవ్వఁడో కాదు ♦ నాయహమ్ము.

ఆతఁడెంతయు సిగ్గు లే ♦ నట్టివాఁడు.
అతనితోఁగూడి నీద్వార ♦ మందుఁ జేర
నాకు సిగ్గగుచుండు న ♦ నాథనాథ !

31

"బద్ధుఁడా నీకు నెవనిచే ♦ బంధనంబు
గలిగెనో నాకుఁ జెప్పంగఁ ♦ గలవె?" యనినఁ
"ప్రభువుచే" నని బద్ధుండు ♦ పలికెనిట్లు ;
"శక్తి సంపదలందు నీ ♦ జగతిలోన
నందఱిని మించఁగల నని ♦ యాత్మ నెంచి
యధిపునకుఁ జెల్లవలసిన ♦ యర్థమెల్లఁ
గూర్చి యుంచితి నాస్వంత ♦ కోశమందుఁ;
బ్రభువునకు సిద్ధపఱచిన ♦ పాన్పుమీఁద
నిద్రపోయితిఁ బన్నుండి ♦ నిలువలేక ;
కానిమేల్కాని మద్ధనా ♦ గారమందె
యిట్లు బద్ధుండ నైయుంట ♦ నేను గంటి."
"ఇట్లు తెగనట్టిసంకిలి ♦ నెవడు నేసె
బద్ధుఁడా ! చెప్పవే" యని ప్రశ్న సేయ
నొసఁగె నాతఁడు మరల నీ ♦ యుత్తరంబు
"ఎంతయో శ్రద్ధతోడ నీ ♦ శృంఖలంబు
నేనె కావించుకొంటి వే ♦ ఱెవరు గాదు ;

జగము నాగెల్వఁగూడదని ♦ శక్తి గ్రొగ్గు;
నేను నిరుపద్రవస్వేచ్ఛ ♦ నెగడుచుందు;
నంచు రాత్రింబగళ్లు నే ♦ నగ్నికడను
గష్టపడి కాచి కఠినంబు ♦ గాఁగఁ గొట్టి
చేసితిని దీని నెంతయు ♦ సిద్ధముగను;
గొలుకులన్నియు దృఢముగాఁ ♦ గూర్పఁ బడియె
గాని చిక్కించుకొని నన్నె ♦ కరము నొక్కె."

32

ఈజగతిలోనఁ బ్రేమించు ♦ హితులు నన్నుఁ
బట్టి బంధింతు రెంతయు ♦ భద్రముగను.
స్వేచ్ఛ నన్నుంచునట్టినీ ♦ ప్రేమ మరయ
నంత కధికంబు వేరు నై ♦ యలరుచుండు.
మఱతు వారిని నే నంచు ♦ వెఱచి నన్ను
నొక్కపుడుఁగూడ నొంటిగా ♦ నుండనీరు.
ఎన్నిదినములు గడచిన ♦ నేమి చెప్పుదు
నొక్కమాఱైనఁ గనపడ ♦ కుందు వీవు.
ఎలమి నాప్రార్థనల నిన్నుఁ ♦ బిలువ కున్నఁ
బ్రీతితో నిన్ను హృదయానఁ ♦ బెట్ట కున్న
వేచు నీప్రేమ మెపుడు నా ♦ ప్రేమకొఱకె.

33

పగలు కొందఱు వచ్చి నా ♦ భవనమునకు
"యిచట నొకచిన్నగది యిచ్చి ♦ తేని మేము
సాయపడి దేవపూజలో ♦ స్వామి దైవ
వరప్రసాదంబునందు మా ♦ వంతుఁ గొందు"
మంచు నొకమూల సాధువు ♦ లట్టులుండి
రాత్రి చీఁకటిలోనఁ బ ♦ విత్రమైన
గుడిఁ బ్రవేశించి యల్లరిఁ ♦ గడు నొనర్చి
స్వామిసన్నిధిలోనిప్ర♦సాద మెల్ల
నతిమలినఘోరభూరిదు ♦ రాశచేత
నాఁచికొని రేమి చెప్పుదు ♦ నాచరిత్ర?

34

"నాదుసర్వస్వమా!" యంచు ♦ నాథ! నిన్నుఁ
బిలువఁగాఁ గల్గి నాలోన ♦ మెలఁగుచుండు
నంశమే సర్వదా నిల్చి ♦ యలరుఁ గాత!
అన్నిటను నిన్నె పొందుచు ♦ నన్నికడల
నిన్నె చూచుచు నాప్రేమ ♦ నిరత మొసఁగి
కొలుచునాలోనియంశమే ♦ నిలుచుఁగాత!
ప్రభువ! నిను దాఁప కెప్పుడుఁ ♦ బ్రకటపఱచి

పొలుచునాలోనియంశమే ♦ నిలుచుఁ గాత!
భవమదా రేచ్ఛలో నను ♦ బద్ధుఁ జేసి
జీవితంబున నీకోర్కి ♦ చెల్లఁ జేసి
నీదుప్రేమానుబంధమ్ము ♦ నెగడఁ జేయు
వెలుఁగు మద్బంధనాంశమే ♦ నిలుచుఁ గాత!

35

ఉన్నతశిరంబు నిర్భయ ♦ యుతమనంబు
నుచితవిద్యాప్రదానమ ♦ హోదయంబు
క్షుద్రకుచితగృహచ్ఛిద్ర ♦ కుడ్యజాత
విభజనవిహీనలోకంబు ♦ శుభకరంబు
సత్యగంభీరదేశనం ♦ జనితపూత
వాక్యసముదాయశోభిత ♦ వైభవంబు
పూర్ణతను బొందఁగా నెంచి ♦ భుజము లెత్తి
వృద్ధిఁ గాంచెడువివిధప ♦ రిశ్రమంబు
సారహీనదురాచార ♦ ధార మనెడు
నూషరక్షేత్రములఁ బార ♦ కుండునట్టి
సదమలవివేకపూరసం ♦ చారణంబు
జ్ఞానయత్నంబు లానాఁడు ♦ నాఁటి కలరు
పగిది నీచేత నడుపంగఁ ♦ బడు మనంబు
చారుసత్యస్వతంత్రభూ ♦ స్వర్గమరయు;

జనక ! నాదేశజనులు ద ♦ త్స్వర్గమునకు
మేలుకొందురు గాక ! నీ ♦ మూలకముగ.

36

భావమునఁ బాదుకొన్నట్టి ♦ పాపములను
మూలనిచ్ఛేదముగఁ గొట్టి ♦ మోదమిడుము.
ప్రభువతంసమ ! యిదియ నా ♦ ప్రార్థనమ్ము.
లీల సుఖదుఃఖముల నోర్వఁ ♦ జాలునట్లు
కూర్మితో దయసేయుము ♦ గొప్పబలము.
బీదసాదల నెన్నఁడు వీడనట్టు
లోర్చి గర్వాంధునకు నొగ్గ ♦ కుండునట్లు
కూర్మితో దయసేయుము ♦ గొప్పబలము.
తుచ్ఛసంసారవిషయాళిఁ ♦ దూలకుండ
మనసు ఘనమార్గమునఁ బెట్టి ♦ మనెడునట్లు
కూర్మితో దయసేయుము ♦ గొప్పబలము.
స్వామి ! సంపూర్ణమైనట్టి ♦ ప్రేమతోడ
బలము నర్పించి నీయిచ్ఛ ♦ సలుపునట్లు
కూర్మితో దయసేయుము ♦ గొప్పబలము.

37

శక్తి తుద ముట్టె; నాయాత్ర ♦ సాగ దింక

మూయఁబడెఁ ద్రోవ; సామగ్రి ♦ ముగిసి పోయెఁ;
గొనకు నెందేనిఁ దలఁ దాఁచు ♦ కొనఁగవలసె;
నంచు మదిలోన నేను ద ♦ లంచు చుంటిఁ;
గాని నీయిచ్ఛ కవధి నా ♦ లోనఁ గలదె?
ప్రాఁతమాటలు నోటిలో ♦ పల నశింప
స్వాంతమందుండి నవగీత ♦ చయము వెడలు.
ప్రాఁతపథములు దప్పిన ♦ భవ్యముగను
క్రొత్త దేశంబు వింతలఁ ♦ గూడి తోఁచు.

38

“ నేను వలచిన దంతయు ♦ నిన్నె నిన్నె ”
యనెడుమాటల నాహృద ♦ యంబు సతము
నిండుఁదమితోడ వల్లించు ♦ చుండుఁ గాత!
విడక రేయుంబవళ్లును ♦ వెంట నంటి
నన్నుఁ బెడత్రోవలను బెట్టు ♦ చున్నయాశ
లెల్ల మిథ్యలె కాని మ ♦ రేమి గావు.
వెల్తురునకైన ప్రార్థన ♦ వెలికి నిడక
రేయి చీఁకటిలో దాఁచు ♦ రీతి యందు
నేనువలచినదంతయు ♦ నిన్నె యనెడు
మ్రోఁత విస్మృతమతిలోన ♦ మ్రోఁగుచుండు.
శాంతమును నెంతగొట్టిన ♦ శాంతమందె

శాంత్రమును రోయుచండవ ♦ ర్షంబుఁబోలె
దేవ! నీప్రేమ కే నెంతఁ ♦ దిరుగఁ బడిన
" నేను వలచిన దంతయు ♦ నిన్నెనిన్నె"
యనెడుమాటలె నాలోన ♦ నలరుచుండు.

39

చిత్త మిది గట్టిపారి శు ♦ ష్కించినపుడు
వరదయావృష్టితోఁ గూడి ♦ తరలి రమ్ము.
జీవకళ జీవితములోనఁ ♦ జెడినయపుడు
విమలగానామృతం బొల్క ♦ వెడలి రమ్ము.
బాహ్యశబ్దంబు చెవిలోనఁ ♦ బడకయుండ
నెల్లకడలను ధుములంబు ♦ లెచ్చినపుడు
శాంతివిశ్రాంతులను గూడి ♦ సౌమ్యమూర్తి!
వడివడిగ నాదుమదిపయి ♦ వ్రాల రమ్ము.
తుచ్ఛహృదయమ్ము దైన్యంబు ♦ తోడ నొక్క
మూలఁ దలవంచి కూర్చుండు ♦ కాలమందు
దేవదేవేంద్ర! తలుపులు ♦ దెఱచి వైచి
రమ్ము రాజ్యాభిషిక్తున ♦ ట్రమాట్టుభంగి.
మాయతో నాస మదికన్ను ♦ మూయునపుడు
నిర్మలాతులభూరిని ♦ ర్నిద్రతేజ!
మెఱుము లుఱుములతో రమ్ము ♦ మేఘమట్లు.

## 40

స్వామి! శుష్కించినట్టి నా ♦ స్వాంతమందు
నెంతయోకాలము గతించె ♦ వృష్టిలేక.
యంబరం బంబరము లేని ♦ యట్లు లుండి
యతిభయావహమైనయా ♦కృతిని దాల్చు;
నంబుదముమీఁదివలిపార ♦ మైన లేదు.
శాంతవృష్టికి నైనసూ ♦ చనయె లేదు.
శిష్టమోహన ! నీకు న ♦ భీష్టమేని
మృత్యుభీకరచండప్రి ♦ వృష్టిఁ బంపి
మెఱపుదెబ్బలచేతను ♦ మింటి నెల్లఁ
దత్తరిలునట్లు చేయుము ♦ తత్క్షణంబ.
దారుణనిరాశతోడిమ ♦ త్స్వాంత మందుఁ
దిన్నగాఁ జేరి కాల్చునీ ♦ దీర్ఘమైన
యుష్ణము మరల్పు మోనాథ ! యోర్వలేను.
కోపమును దండ్రి! మదిలోనఁ ♦ గొన్ననాఁటి
కంటెఁ దడిఁగొన్న తల్లివోలె ♦ గ్రాలుచుండు
త్వద్దయాభ్రముఁ బైనుండి ♦ వ్రాలనిమ్ము.

## 41

ఏడనిల్చితి ? వోప్రియ ! ♦ నీడఁ డాఁగి ;

వారివెన్కను గన్నులం ♦ బడకయుండ
దుమ్ము గ్రమ్మినతోవలోం ♦ ద్రోసికొనుచుం
జనుచున్నారు దాంటి నీ ♦ సరకు గొనక ;
పూజసామగ్రి ముందటం ♦ బొందుపఱచి
వేచి బడలితి నెంతయో ♦ వేళనుండి ;
వచ్చిపోయెడువారు పు ♦ ష్పములయందు
నొక్కటొక్కటె కొనిపోవు ♦ చుండి రిదిగో !
బుట్ట వట్టిది గావచ్చెం ♦ బూలు ముగిసి ;
కడచెం బూర్వాపరాహ్ణముల్ ; ♦ పొడమె సంజ
నిద్ర కనులకు రాం జొచ్చె ♦ నీడ నుంట ;
గృహములకు నేగువార లీ ♦ క్షించి నన్నుం
జేరి నవ్వుచు ముంచిరి ♦ సిగ్గులోన.
బిచ్చ మెత్తెడుకన్నియ ♦ విధము దోంపం
గొంగు మోమునం గూరిచి ♦ కూరుచుంటి ;
"నేమిగోరెద ?" వని నన్ను ♦ నెవ రడిగినం
గన్నులను వాల్చి క్రిందికి ♦ మిన్న కుంటి ;
నీకొఱకు వేచి యున్నాను ♦ నే నటంచు
వచ్చుటకు మాట నీవు నా ♦ కిచ్చి తంచుం
జేరి యడిగినవారితోం ♦ జెప్ప నగునె ?
తుచ్ఛ మగుదీనిం గాన్కగాం ♦ దెచ్చితి నని
యెట్లు తెల్పుదు నాకు సి ♦ గ్గని గాదె ?

# గీతాంజలి.

పొంగుదును దీనికయి యంత ♦ రంగమందె.
గడ్డిపైఁ గూరుచుండి యా ♦ కసముఁ జూచి
నీవు దేవ! తటాలున ♦ నింగినుండి
భవ్యతరముగ దిగెదువై ♦ భవముఁ గూర్చి
కలవరించుచు నుంటి ని ♦ క్కరణి నేను.
ఒక్కమారు తళుక్కని ♦ లెక్కలేని
దీపకోటులు వెల్గెడే ♦ దీప్యముగను.
నీరథస్వర్ణకేతన ♦ నిచయ మెల్ల
నిగనిగల నీని పటపట ♦ నింగి నాడె.
దేవ! నను దుమ్ములోనుండి ♦ లేవ నెత్తి
వేసవిని గాలిఁ దూలుతీ ♦ వియవితాన
గర్వలజ్జాభరంబులఁ ♦ గడువడంకు
చింపిగుడ్డల నిబ్బిద ♦ చిన్నదానిఁ
బ్రీతి నీప్రక్కఁ గూర్చుండఁ ♦ బెట్టికొనఁగ
నీవు పీఠంబు డిగ్గి వేం ♦ చేయఁజూడ
నిరుగడల దారిపొడుగున ♦ నెల్లజనులు
నివ్వెఱను నోరు దెఱచుచు ♦ నిల్వఁ బడిరి.
కాని యెంతయొకాలంబు ♦ గడచి పోయె ;
నింతవఱకును వేచిన ♦ యీచెవులకు
నీరథరథాంగనినదంబు ♦ చేర రాదు.
కనుల మిఱుమిట్లు ♦ గొలిపెడి ♦ కాంతితోడి

వైభవమ్ములు కలకల ♦ స్వనము లొప్ప
నెన్నియోయుత్సవము లిట్లు ♦ లేగుచుండ
వీనివెనుకను నీడలో ♦ మౌనముగను
నిలిచి యుండెడువాఁడవు ♦ నీవె కావె?
వ్యర్థ మగునాసతో వేచి ♦ వంతఁ గుంది
యిట్లు కృశియింపవలసిన ♦ దేనె కాదె?

## 42

ఏను నీవును మాత్రమే ♦ యెక్కి పడవ
యాత్ర వెడలంగ వలయు; న ♦ య్యాత్రయందు
దేశ మేనియు మఱియు ను ♦ ద్దేశమేని
నుండ దనియును జగతిలో ♦ నొక్కనికిని
దెలియఁ గూడనియట్టి యా ♦ దేశమనియు
వేకువను నొక్క గుసగుస ♦ వినఁగ వచ్చె.
పారమేలేని యమ్మహా ♦ వార్ధియందు
నాథ! సడిలేక వినెదునీ ♦ నవ్వుచేత
వివిధమధురస్వరములచే ♦ వింతగాను
శబ్దబంధములను వీడి ♦ సరళముగను
దరఁగ లట్టులు మద్గీత ♦ తతులు పొంగు.
తరుణ మింకను రాలేదె ♦ తరలుటకును?
సలుపవలసినకార్యముల్ ♦ గలవె యింక?

అదిగో! తీరంబుపై సంజ ♦ యావహించెఁ;
గనువెలుతు రుండఁగానె యా ♦ కడలిపులుఁగు
లెలమిఁ దమతమగూఁడుల ♦ కెగసి వచ్చె.
ఎపుడు విత్తురు గొలుసుల? ♦ నెపుడు పడవ
సంజయందలి కడపటి ♦ చాయ వోలెఁ
గానరాకుండ రాత్రిలోఁ ♦ గలసి పోవు?
నెవఁడు చెప్పంగఁ గలఁడిది ♦ యెవని కెఱుక?

## 43

స్వామి! నే నీకు సంసిద్ధ ♦ పడనినాఁడు
పిలువఁ బడకుండ నాకును ♦ దెలియకుండ
నొక్కసామాన్యకరణి నా ♦ యుల్లమందు
నెమ్మదిగఁ జొచ్చి నాజీవి ♦ తమ్ము లోని
స్థిరముగా మది నిల్వని ♦ చిన్నిచిన్ని
యెన్నియోయంశములమీఁద ♦ నీశ! నీదు,
"నిత్య" మర్మముద్రఁ జక్కఁగా ♦ నొత్తినావు.
లీల దీపంబు నేను వెలిగింప నేఁడు
కాంతిపడి వానిమీఁద నీ ♦ సంతకంబు
స్పష్టముగఁ దోఁచె నవియెల్ల ♦ బాల్యమందుఁ
గాంచి మఱచినసుఖదుఃఖ ♦ గణముతోడఁ
జేరి దుమ్మున నటునిటుఁ ♦ జెదరియుండె.

శైశవంబున దుమ్ములో ♦ నలిపినట్టి
క్రీడలనుగూడ నేవతోఁ ♦ జూడ వీవు.
తార లీనెడునిప్ప్రితి ♦ ధ్వనులుఁ గూడ
నాటగది నాఁడు నేవిన్న ♦ యడుగునడులె.

## 44

విడువకుండఁగ వెలుతురు ♦ వెంట నంటి
తఱుము నీడను వేసంగి ♦ దారిఁ బట్టి
వచ్చు చుండెడువర్షముల్ ♦ వాంఛతోడ
వీథివెంబడిఁ గూర్చుండి ♦ వేచి యిట్లు
కాంచు టెంతయు మోదమ్ము ♦ నించు మదికి.
కాంచి యెఱుఁగనియంతరి ♦ క్షములనుండి
దూత లరుదెంచి శుభవార్త ♦ తోడ నాకు
స్వాగత మొసంగి తమదారిఁ ♦ జనిరి వేగ.
అంతరంగము లోలోన ♦ నలరఁ దొడఁగె.
మధుర మగునూర్పుతో వీఁచె ♦ మారుతంబు.
ప్రొద్దు వొడిచినదాదిగాఁ ♦ బ్రొద్దు గ్రుంకు
దనుకఁ గూర్చుండు వాకిటఁ ♦ దలఁగ కుండ;
నున్న దున్నట్లుగా వచ్చు ♦ నెన్నఁడేని
శుభసమయ మేను దప్పక ♦ చూతు నంచు
నెమ్మది నెఱింగి యున్నాను ♦ నిశ్చయముగ.

ఇంతలోపల నిచట నే ♦ కాంతమందుఁ
బరమసంతోషమునఁ బాటఁ ♦ బాడుచుందు.
గాలియునుగూడ నాశాసు ♦ గంధ మంది
పొలయుచున్నది యెంతయు ♦ ముదము నింపి.

## 45

ఆలకించితె సడిలేని ♦ యతనినడక?
వచ్చు వచ్చును సతతంబు ♦ వచ్చుచుండుఁ
బగలు పగలును రే రేయి ♦ యుగము యుగముఁ
నిమిషనిమిషము నాతఁడు ♦ నిలువకుండ
వచ్చు వచ్చును సతతంబు ♦ వచ్చుచుండు.
వివిధరీతుల నామనో ♦ వృత్తులందుఁ
బాట లెన్నియొ నానాఁట ♦ బాడి యుంటి;
వానిపదజాల మంతయు ♦ వ్యక్తపఱచు
వచ్చు వచ్చును సతతంబు ♦ వచ్చు నంచు.
చారుపరిమళముల వేదఁ ♦ జల్లి చల్లి
వఱలు చైత్రంబులో వన ♦ పథము పట్టి
వచ్చు వచ్చును సతతంబు ♦ వచ్చుచుండు.
ధాత్రిఁ దమి ముంచు నవ్వర్ష ♦ రాత్రులందు
నుఱుము మేఘరథం బెక్కి ♦ తఱలివచ్చు
వచ్చు వచ్చును సతతంబు ♦ వచ్చుచుండు.

చింతఁ జిక్కినచిత్తముల్ ♦ జేరి యొత్
తద్దయును శాంతి నిడునవి ♦ తత్పదములె.
పైఁడిజిగినంటి సంతోష ♦ భావమునకుఁ
దశతళలఁ గూర్చునవి కూడఁ ♦ దత్పదములె.

## 46

ఎంతకాలంబునుండి న ♦ న్నెలమిఁ జేర
నెడ తెగక వచ్చుచున్నావొ ♦ యెఱుఁగ నేను;
రవికిఁ జుక్కల కేని ని ♦ రంతరంబు
నిన్ను నానుండి దాఁపగా ♦ నెన్నఁడేని
శక్తి గలుగంగఁజాలునే ♦ స్వామి! చెపుమ.
మాపు ఱేపును నెన్నియో ♦ మార్లు నాకు
వినఁబడియె నీదుకాల్సడి ♦ వినఁగఁబడియె;
వచ్చి నీదూత నామదిఁ ♦ జొచ్చి నన్ను
గోప్యముగఁ బిల్చి పోయెను ♦ గూర్మితోడ.
ఏమొకోకాని నేఁడు నా ♦ కెపుడులేని
యతిశయంబైనయుత్సాహ ♦ మంకురించె;
మించి హర్షంబు మదిని గ ♦ లంచి పాఱెఁ;
బని ముగించెడుతఱి వచ్చె ♦ ననఁగఁ దోఁచె.
సన్నిధిని దెల్పుపరిమళ ♦ సారలవము
ఘ్రాణపర్వముగా సోఁకె ♦ గాలిఁ గలసి.

## 47

అతనికై వేచి యుంటి ని ♦ రర్థకముగ;
రాత్రి కొనసముట్టవచ్చెను ♦ రాఁడు రాఁడు;
బడలి నిద్రించినపుడు నా ♦ బసకు నతఁడు
వచ్చునో హటాత్తుగాను ప్ర ♦ భాతవేళ
నంచు నాచిత్తమందు భ ♦ యంబు పొడమె.
దారి తెఱవుఁడు; తెఱవుఁడు ♦ తలుపు లెల్ల;
నతని నాటంకపఱుపకుఁ ♦ డాప్తులార!
అతనికాల్సడి నను లేప ♦ దయ్యెనేని
లేప యత్నింపకుఁడు; మీరు ♦ లేపకుండు.
కలకలముసేయుపక్షుల ♦ వలనఁ గాని
సుప్రభాతోత్సవంబునఁ ♦ జూఱలాడు
గాలిచేఁ గాని మేల్కొనఁ ♦ గాదు నాకు.
నాథుఁ డొకవేళ నున్నదు♦న్నట్లు వచ్చి
యాలయముఁ జేరెనేనియు ♦ హాయిగాను
నిద్ర పోనిండు; పోనిండు ♦ నిద్ర నన్ను.
అతఁడు ముట్టినఁ జాలు నే ♦ నంతరింతు
ననెడువెలలేనినిద్ర నా ♦ హాయినిద్ర!
నిదుర చీఁకటిలోనుండి ♦ పొదలి వచ్చు
స్వప్నగతి నిల్వ నతఁడు నా ♦ సమ్ముఖమున

నతనిచిఱునవ్వుకాంతిచే ♦ నట్టె విచ్చు
మన్నిమీలితనేత్రాల ♦ కున్నెసాటి?
కాంతు లన్నింటిలోఁ దాలి ♦ కాంతివలెను
రూపులన్నింటిలోఁ దాలి ♦ రూపువలెను
నతఁడు దృష్టికిగోచర ♦ మగునుగాత!
తెలివి నొందిననాయాత్మ ♦ తొలిసుకంబు
నతనికడకంటిచూపుచే ♦ నందుఁగాత!
కాంచి నను నేను నాతని ♦ గాంతుఁగాత!

48

శాంతముగనున్నప్రాభాత ♦ సమయవార్ధి
చారురుతములచేత సం ♦ చలన మొందె.
త్రోవకడఁ బూలు వికసించి ♦ తొంగలించె;
స్వర్ణసంపద మేఘాల ♦ సందులందు
సిరులఁ జల్లుచు విరివిగాఁ ♦ జెదరి యుండె.
దేని లక్ష్యంబుసేయక ♦ ధీరులట్లు
తొరతొరగఁ బోవుచుంటిమి ♦ త్రోవఁబట్టి
పాటలు విలాసముగ మేము ♦ పాడలేదు;
ఆటలునుగూడ నెవ్వియు ♦ నాడలేదు;
బేరములకయి గ్రామముల్ ♦ చేరలేదు;
నోటిలోనుండి యొకటైన ♦ మాట లేదు;

# గీతాంజలి.

ఎవ్వఁ డొకసారి యైనను ♦ నవ్వలేదు;
నేలఁ జూచుచు నెక్కడ ♦ నిలువలేదు.
వేళ గడచినకొలఁదిని ♦ వేగ మెచ్చ
నడుచుచుంటిమి మార్గంబు ♦ గడచుచుండె;
గగనమణి నింగినడుమను ♦ గ్రాలఁజొచ్చెఁ;
బావురమ్ములు నీడలో ♦ పలను మూల్గె.
మట్టమధ్యాహ్నమందలి ♦ మండుగాలి
నెండుటాకులు సుడిగొని ♦ నృత్యమాడె.
మఱ్ఱిక్రీనీడ గొల్లఁడు ♦ గుఱ్ఱువెట్టి
కలవరించుచు నిద్రించెఁ ♦ గాళ్లు చాపి;
నీటియొడ్డునఁ గూర్చుండి ♦ నేనుఁగూడ
బడలియుండినయంగముల్ ♦ పచ్చగడ్డి
మీఁదఁ జాపితిఁ గొంచెము ♦ సేదదీరఁ;
దుచ్ఛముగఁ జూచి నవ్విరి ♦ తోడివారు;
తరలిపోయిరి యెత్తిన ♦ తలలతోడఁ;
దిరిగి చూడక నిలువక ♦ తెన్నువట్టి
కొనకు దూరాన నీలంపు ♦ మసకలోనఁ
గలసిపోయిరి కనులకుఁ ♦ గానరాక;
ఎన్నియొ బయళ్ల, గుట్టల ♦ నెక్కి-దాఁటి
చనుచునుండిరి దూరదే ♦ శములఁ గడచి.
అంతమెఱుఁగనిమార్గమ్ము ♦ నంది చన్న

ధీరవరులార! మాన్యులు ♦ మీరె సుండు.
వెక్కిరింతలు చీవాట్లు ♦ పెక్కుమార్లు
లేపయత్నింప లక్ష్యంబు ♦ లేకయుంటి.
హర్ష గర్భితగాఢ దై ♦ న్యంబునందు
మందమోదాంకురచ్ఛా ♦ యయందుఁ బడితి;
నింక లేవనటంచు నే ♦ నెంచుచుంటి.
కొనల రవికాంతి ప్రసరించు ♦ క్రొత్త తమము
లోనివిశ్రాంతి నాహృద ♦ యానఁ బర్వ;
యాత్రవిషయంబె మఱచితి ♦ నాత్మలోన;
నీడఁబోలిన మాయలో ♦ నెగడుచుండు
వింతలకు గానములకు నా ♦ స్వాంత మెల్లఁ
బెట్టివైచితి నూరక ♦ పెనగకుండ.
కట్టకడపట మేల్కాంచి ♦ కనులు దెఱవ
నీవు ననుఁ జేరి యిట్లు నా ♦ నిద్ర నెల్ల
స్మేరపూరంబుచే ముంచు ♦ చెలువుఁ గంటి.
దీర్ఘమును దుర్గమంబు నీ ♦ దివ్యపథము;
నిన్నుఁ బొందంగసాధ్యమై ♦ యున్నెయంచు
నెంత వెఱచితి నేను బ్రా ♦ ణేశ మదిని!

## 49

నీదుసింహాసనము డిగ్గి ♦ నెమ్మితోడ

నాకుటీరమువాఁకిట ♦ నాథ! నీవు
వచ్చి నిలిచితి వేమన ♦ వచ్చెఁ బ్రేమ !
చేరి యొకమూల గానంబు ♦ సేయుచుంటి;
నొంటిగా నేను బరులకుఁ ♦ గంటఁబడక
యీమధురగీతి చెవిసోఁక ♦ నెలమితోడ
నాకుటీరమువాఁకిట ♦ నాథ ! నీవు
వచ్చి నిలిచితి వేమన ♦ వచ్చెఁ బ్రేమ !
గానమున జాణలెందఱో ♦ గలరు; నీదు
భవనమునఁ బాట లెప్పుడుఁ ♦ బాడుచుండ్రు.
ఎఱిఁగి యెఱుఁగక పాడిన ♦ సరళగీతి
యెట్లు నీప్రీతిపాత్రమై ♦ యెసఁగె దేవ ?
చేతమున జాలినిడుచున్న ♦ గీత మొకటి
జగతిలోనిమహాగాన ♦ సమితిఁ గలయు,
సుమము నొక్కటి పారితో ♦ షముగఁ గొంచు
నాకుటీరములోనికి ♦ నాథ ! నీవు
వచ్చి నిలిచితి వేమన ♦ వచ్చెఁ బ్రేమ !

## 50

ఇంట నింటను బిచ్చంబు ♦ నెత్తుటకును
గ్రామమునఁ బోవుచుండ మా ♦ ర్గంబు వట్టి
పరమవైభవదీప్తను ♦ స్వప్న మట్లు

కానఁబడె దూరమున నీదు ♦ కనకరథము.
అహహా! ఱేఱేఁ డెవండని ♦ యబ్రపడితి
నతిశయింపఁగఁజొచ్చె నా ♦ యాశ లెల్ల;
వదలె నాదుర్దినము లని ♦ మదికిఁ దోఁచె;
సిరులు వెదఁజల్లఁబడును బో ♦ క్షితి నటంచు
నడుగకయె యియ్యఁబడుఁ గాన ♦ నగునటంచు
బిచ్చమునకయి దూరాన ♦ వేచియుంటి;
వడిగ రథమును నాకడ ♦ వచ్చి నిలిచె.
దృష్టి నామీఁదఁ బఱపుచుఁ ♦ దేరు డిగ్గి
నవ్వుచును వచ్చితివి నీవు ♦ నన్నుఁ జేర;
భాగ్యము ఫలించె ననుకొంటిఁ ♦ బ్రభువతంస!
యింతలోఁ జాపి కుడిచెయ్యి ♦ యేమి నాకు
నియ్యఁగల వని యడిగితి. ♦ వేమి చెపుదు?
బిచ్చగానికిఁ జేఁజాపి ♦ బిచ్చ మడుగు
నిట్టి నీప్రభుపరిహాస ♦ మెన్నఁ దరమె?
చిత్తము చలించె నేనేమి ♦ చెప్ప నగునొ
నాకె తెలియక యుండెను ♦ నాథ! యపుడు.
సన్నధాన్యంపుగింజ నా ♦ సంచినుండి
తీసి యిచ్చితి నీకు నో ♦ దేవదేవ!
కాని యామాపు సంచిలోఁ ♦ గ్రాలుచుండు
ధాన్యమును గుప్పవోసిన ♦ దానిలోన

నగపడియె మిన్కులీనుచు ♦ నద్భుతముగఁ;
బరమపూరుష ! యొకచిన్న ♦ పైఁడిగింజ.
అంత నాదెల్ల నీకిచ్చు ♦ నట్టిబుద్ధి
కటకటా ! నాఁడు నాకేల ♦ కలుగదయ్యె
నంచు విలపించితిని జాల ♦ నాత్మలోన.

## 51

రాత్రి యరుదెంచె నెల్లెడఁ ♦ గ్రమ్మెఁ దమము;
పనులు ముగిసెను రాత్రి రా ♦ వలయునారు;
వచ్చి రందఱుఁ గడపటి ♦ వాఁడు వచ్చె;
నూరితలుపుల మూసిరి ♦ యుచితరీతిఁ;
ప్రభువు రానున్నవాఁ డని ♦ పలికె నొకఁడు.
అందులకు నవ్వి యట్లు కా ♦ దంటి మేము.
తలుపుఁ దట్టినయట్లు శ ♦ బ్దంబు గలిగె.
గాలి యని చెప్పి యచటిదీ ♦ పాల నార్పి
కూర్కుకై పండి యుండఁగాఁ ♦ గొంతవడికి
నదిగో! వినఁబడె దూతప ♦ ల్కనియె నొకఁడు.
అందులకు నవ్వి యది వాయు ♦ వంటి మేము.
నట్టనడురేయి నొకమహా ♦ నాద మొదవెఁ;
గలవరించుచునిద్రలో ♦ పలఁ బరుంట
దూరమునఁ గల్గునుఱుముగాఁ ♦ దోఁచె మాకు;

నుర్వి వణఁకెను గుడ్యమ్ము ♦ లూఁగియాడెఁ;
దద్దయును గల్గె భంగమ్ము ♦ నిద్దురకును.
అదిగో! రథచక్రనినదమం ♦ చనియె నొకఁడు.
గొణిగితిమి యుఱుమం చని ♦ కూర్కి యుండ
రాత్రి యుండఁగ నంధకా ♦ రమ్ము నందె
భూరిభేరీరవమ్ములు ♦ బోరుకొనియె.
లేదు జాలమ్ము లెండను ♦ నాద మడరె.
ఱొమ్ములను బెట్టుకొని మాక ♦ రమ్ము లపుడు
వడవడ వడంకుచుంటిమి ♦ భయముచేత.
అదిగో! ఱేసిధ్వజం బని ♦ యనియె నొకఁడు.
అంత మునిగాళ్ల నిలఁబడి ♦ యందఱమును
నఱచితిమి యాలసింపఁ గా ♦ దనుచుఁ దమిని.
రాజు వేంచేసెఁ బూలహా ♦ రంబు లేద?
విభుఁడు గూర్చుండుటకు సింహ ♦ పీఠ మేడ?
భవ్యతరముగ వెల్గుదీ ♦ పంబు లేద?
బ్రతుకు లజ్జాభరం బయ్యె; ♦ బ్రదుక నేల?
వితతభవనంబు లే దలం ♦ కృతులు లేవు.
అనుచు మేమున్నఁ గనుఁగొని ♦ యనియె నొకఁడు
"అఱచి ఫలమేమి స్వాగత ♦ మతని కిమ్ము.
వట్టిచేతులతో మఱి ♦ వట్టివైన
గదుల కాతనిఁ గొనిపొమ్ము ♦ కదలి రమ్ము."

తెఱవఁబడుఁగాక తలుపులు; ♦ దివ్యరవము
పొడమ శంఖాళి యొత్తంగఁ ♦ బడునుగాక!
అంధకారమయంబు భ ♦ యంకరంబు
నైనమనయింటి కరుదెంచె ♦ నధిపుఁ డిపుడు
నట్టనడురేయి మనయెడ ♦ నెట్టిదయయొ;
మేఘముల్ గడునుఱిమెను ♦ మింటఁ గ్రిమ్మఱి
తమము మెఱపులచేతను ♦ దత్తరిల్లెఁ;
దెమ్ము నీచింపిచాప నీ ♦ దేవునకును;
ముందు ముంగిటఁ బఱువుము ♦ పొందికగను;
గాలరాత్రికి నాథుఁడై ♦ గ్రాలుఱేఁడు
చండవర్షంబులోఁ జెప్ప ♦ కుండ వచ్చె.

52

నీదుగొజ్జంగిపూదండ ♦ నేను గోరఁ
దలఁచితిని గాని ధైర్యంబు ♦ గలుగ దయ్యె.
స్వామి! వేకువ వీడునీ ♦ పాన్పుమీఁద
రాలినవి గొన వేచితిఁ ♦ జాలఁ దమిని.
అర్థికైవడి వేడ్కతో ♦ నరయు చుంటి
రేపకడ నొకరెండుపూ ♦ రేకులకును
అహహ! నేనేమి గనుగొంటి ♦ నరసి యరసి
నాకు నీవిడ్డపేర్మిచి ♦ హ్నంబదెద్ది?

దివ్యసుమములో? పరిమళ ♦ ద్రవ్యతతులో?
కాక పన్నీరుబుడ్డియో? ♦ కాదు కాదు.
జ్వాలవలె వెల్గి పిడుగువోల్ ♦ బరువుఁగల్గి
వరలుబలమైననీకర ♦ వాలు దేవ!
బాలరవికిరణాళి ప్రి ♦ భాతవేళ
వచ్చి నీసెజ్జఁ బర్వ గ ♦ వాక్షమునను.
వనిత! నీవేమి గంటివే♦ యనుచు నన్ను
వేకువను బక్షి గూయుచు ♦ వేడ్క నడుగు.
దివ్యసుమములో? పరిమళ ♦ ద్రవ్యతతులో?
కాక పన్నీరుబుడ్డియో? ♦ కాదుకాదు.
నీకరము పట్టు ఖడ్గంబు ♦ భీకరంబు.
ఎట్టివర మిది నాకుఁ బ్రా ♦ ణేశయంచు
వింతతోఁ గూరుచుండి యో ♦ చింతు నెపుడు.
ఎచట దాపంగవలయునో ♦ యెఱుఁగరాదు.
అబల నేఁగానఁ దాల్పంగ ♦ నగును సిగ్గు.
అక్కునను జేర్పఁ గాదు గా ♦ యంబు వడును.
అయిన నీవు ప్రసాదించి ♦ నట్టిదీని
దుఃఖకరమైన భరమైనఁ ♦ దొఱఁగకుందు.
హృదయసీమనె ధరియించి ♦ యెసఁగుచుందు.
ఇది మొదలు లేదు భయము నా ♦ కీజగాన
నాదుపోరాటముల నెల్ల ♦ నాథ! జయము

నీకె కల్గును బో యింక ♦ నిక్కముగను.
మకుటముగ నిత్తుఁ బ్రాణంబు; ♦ మరణమునకు
నతనిసాయంబు నీవు నా ♦ కంపియుంట.
బంధనమ్ముల నెల్లను ♦ బట్టి నఱుక
భవదతులఖడ్గ మున్నది ♦ భయము లేదు.
సేయ నిఁకఁ దుచ్ఛమైనకై ♦ సేఁత లెవియు
వేచి మూలల విలపించు ♦ విధముగాని
వలపు సిగ్గులు గాని నా ♦ వలన నింకఁ
గలుగఁజాలవు ప్రాణేశ ♦ కలుగలేవు.
యోగ్యభూషణముగ ఖడ్గ ♦ మొసఁగినావు
బొమ్మసొమ్ముల నేనింకఁ ♦ బూనఁ బూన.

53

పలు తెఱంగులరంగులఁ ♦ బరిఢవిల్లు
రత్నములచేత నక్షత్ర ♦ రాజిచేత
ఖచిత మైనట్టినీదుకం ♦ కణము చూడ
నెంతయు మనోహరంబయి ♦ యొసఁగుఁ; గాని
సంజకోపమ్ముపోలు కెం ♦ జాయలోనఁ
జక్కవిచ్చిన గరుడుని ♦ ఱెక్కలట్లు
కాంతివంపునవెల్గు నీ ♦ కత్తి చూడ
నంతకంటెను నందమై ♦ యలరుదేవ!

మిత్తి కడపటిదెబ్బచే ♦ హత్తినట్టి
బాధఁ దుదిఁ దత్తరిల్లెడు ♦ ప్రాణమట్లు
సంచలించుచు నుండునీ ♦ ఖరించుకత్తి
చండకాంతిని మెఱసి యు ♦ ద్దండమోహ
మంతయును భస్మ మొనరించు ♦ నతులశుభ్ర
తేజమును బోలి క్రాలునీ ♦ తేజువాలు.
ఉడుమణులచేత ఖచితమై ♦ యొప్పునీదు
కంకణము సుందరం బయి ♦ కడుఁ జెలంగుఁ;
గాని చూడంగఁ దలపంగఁ ♦ గానియట్టి
యతులసౌందర్యమహిమ చే ♦ నలరుగాదె.
వరలునీచేతి తరవారి ♦ వజ్రధారి!

## 54

అడుగ లే దేమియును నిన్ను ♦ నడుగ లేదు.
చెవిని బడ నీకు నాపేరుఁ ♦ జెప్ప లేదు.
నీ వరుగుచుండ నూరక ♦ నిలిచి యుంటిఁ;
గ్రాలు చుండెడువృక్షంపు ♦ వాలునీడ
నొంటిగా నుంటి నే నూతి ♦ యొడ్డునందు.
నీరు నల్లనికడవల ♦ నిండ నింపి
కొంచుఁ బోయిరి యిండ్లకు ♦ మించుబోండ్లు.
అమ్మ ప్రొద్దెక్కెఁ బోదము ♦ ర మ్మటంచుఁ

బిలిచినం బోక యేమేమొ ♦ తలఁపులందు
మునిఁగి తోఁచక నేఁ బొద్దుఁ ♦ బుచ్చు చుంటి.
నాకు నీవచ్చునడి చెవి ♦ సోఁక లేదు.
నను గనెడుచూపె నీవిన్నఁ ♦ దనముఁ జెప్పె.
"దప్పిఁ గొంటిని బాంధుఁడ ! ♦ దప్పిఁ గొంటి"
ననెడునీకంఠమే తెల్పె ♦ నలసి యుంటఁ;
గానఁ గలవరమును మాని ♦ కడవ వంచి
నీకుదోయిటఁ బోసితి ♦ నీరములను;
గాలిచే మీఁద నాకులు ♦ గలగలమనెఁ;
గనులఁ బడకుండఁ గూసెఁ బి ♦ కంబు నీడ.
దారికోనవంపులోనుండి ♦ తరలి వచ్చి
పొగడపూవువాసనల్ ♦ బుగులుకొనియె.
అడిగితివి పేరు గావునఁ ♦ బొడమి లజ్జ
మానమును దాల్చి నిల్చితి ♦ మాట లుడిగి.
ఇంతకును నేను జేసిన ♦ దేమి గలదు
నీవు నన్మదిలోపల ♦ నిల్పుటకును ?
నీకు దాహంబుఁ దీర్పఁగా ♦ నీర మీయఁ
గాంచుటయె హర్షమున నన్ను ♦ ముంచు చుండు.
స్థిరముగా మన్మనంబునఁ ♦ జేరి నిలిచి
తెల్లగాఁ దెల్లవాఱెను; ♦ మెల్లమెల్లఁ
బక్షిజాలమ్ము లటనటఁ ♦ బాడఁ జొచ్చె.

నింబవృక్షంబుపైఁ బత్త్రి ♦ నిచయములును
గదలి గాలికిఁ జప్పుడు ♦ గలుగఁ జేసెఁ;
జింత సేయుచుఁ గూర్చుంటిఁ ♦ జిత్తమునను.

55

మాంద్య మింకను విడదు నీ ♦ మానసమును;
నిద్రి యింకను విడదు నీ ♦ నేత్రములను;
బుష్పరాజము శివితో ♦ ముండ్లనడుమ
నెంతయును గ్రాలె ననుటను ♦ నీవు వినవె?
మేల్కొనుము జాగు సేయక ♦ మేలు కొనుము.
ప్రొద్దు వ్యర్థంబుగాఁ బుచ్చఁ ♦ బోకు వినుము.
మత్సఖుం డీశిలామయ ♦ మార్గమునకు
నంతమం దుండు కేవలై ♦ కాంతసీమ
నొంటిగాఁ దాను గూర్చుండి ♦ యున్నవాఁడు.
మోసపుచ్చకు పుచ్చకు ♦ మోసమతని.
మేల్కొనుము జాగు సేయక ♦ మేలుకొనుము.
మండు మధ్యాహ్నమందలి ♦ యెండవడికి
బెదరి దివి గుండె లదరిన ♦ నదరుఁ గాక;
తప్తసికతంబు దాహవ ♦ స్త్రంబుఁ దాను
వింతగాఁ దాల్చ విప్పిన ♦ విప్పఁ గాక;
హృదయగంభీరతలమున ♦ ముదము లేదె?

మొట్టినపు డెల్లఁ ద్రోవ యగు ♦ మేలివీణె
భవ్యరవముల నీనదే ♦ బాధపేర?

## 56

నిండి నాలోన నీహర్ష ♦ ముండు నిట్లు.
ఇత్తెఱంగున ననుఁ జేర ♦ వత్తు వీవు.
ఏనె లేకున్న నీప్రేమ ♦ మెచట నుండు?
దివిభువుల నెల్ల నేలెడు ♦ దేవదేవ!
చెన్నుమీఱుచు నుండునీ ♦ సిరుల కెల్లఁ
గైకొనితి వీవు నన్ను భా ♦ గస్థుఁ గాఁగ.
నీమహానంద మేవేళ ♦ నృత్యమాడు
సదనముగ నుండుఁ గాదె నా ♦ హృదయసీమ
భవదుదారేచ్ఛ రూపంబుఁ ♦ బడయుచుండు;
సతతమును దేవ! నాదుజీ ♦ వితమునందు.
నన్ను మోహింపఁజేయఁగా ♦ నాథనాథ!
భవ్యరూపంబు నీ విట్లు ♦ పడసినావు.
దీనికై నీదుప్రేమంబు ♦ లీన మౌను
బేర్మితో నిన్నుఁ బ్రేమించు ♦ ప్రేమలోనఁ;
గడకు రెం డిట్లు పూర్తిగఁ ♦ గలసి పోవ
నందుఁ గానంగ వత్తు వా ♦ నందముగను.

## 57

తేజమా ! నాదుతేజమా ! ♦ దీప్తిచేత
జగములను నింపుతేజమా ! ♦ స్వాంతమందు
శాంతమును గూర్పుతేజమా ! ♦ చక్షువులను
ముద్దుఁగొనుతేజమా ! నీకు ♦ నుద్ది యెద్ది ?
ప్రేమమా ! నాదుజీవన ♦ సీమనడుమ
నిరతమును దేజ మెంతయు ♦ నృత్యమాడు.
ప్రేమమా ! ప్రేమతంతులఁ ♦ బ్రేమతోడఁ
దేజ మొకయింతఁ దాఁకినఁ ♦ దేటముగను
నింగి విచ్చును గాలి చె ♦ లంగి వీచు;
హర్షపూరము భూమిపై ♦ నట్టె పాఱు;
నెలమితోడ సీతాకోక ♦ చిలుక లెపుడు
తేజ మనువారిధిమీఁదనె ♦ తెరలువిప్పుఁ;
జెలఁగుతేజోబ్ధి వీచికా ♦ శీర్షములనె
వెలసి కల్వలు మల్లెలు ♦ విచ్చుచుండు.
స్వర్ణమును మేఘములమీఁదఁ ♦ బారఁ జల్లి
రత్నరాజిని వెదఁజల్లు ♦ రాజుఁగూడఁ;
దేజమే సుమ్ము ప్రేమమా ! ♦ తేజె సుమ్ము
పర్వుఁ బైఁబయిఁ బర్వంబు ♦ పత్రములను
హర్ష మంతటఁ బ్రాఁకును ♦ హద్దుమీఱి

శోకనది ముంపఁ దీర మా ♦ నందరసము
వెల్లువగఁ బాఱి జగముల ♦ నెల్ల నిండె.

58

ధరను మిఱిమీఱుగడ్డిగాఁ ♦ బఱపుచుండు,
చావుబ్రదుకులఁ గవలనీ ♦ జగతిమీఁద
నంచితంబుగ నృత్య మా ♦ డించుచుండు,
గాలివానను బ్రాణులఁ ♦ గదిపి లేపి
వీఁకమై వింతగా నవ్వ ♦ వీచుచుండు,
వెతయెనెడువిచ్చుకెందమ్మి ♦ పీటయందు
జాఱఁ గన్నీరు మిన్నక ♦ కూరుచుండు,
దుమ్ములో నున్నదెల్లను ♦ దులిపి వైచి
యించుకయు నేమియైనను ♦ నెఱుఁగకుండు,
వివిధహర్షప్రవృత్తులు ♦ వేడ్క మీఱఁ
గలసి పోవుత నాయంత్య ♦ గానమందు.

59

పత్త్రముల నృత్యమాడెడు ♦ పైఁడికాంతి
నింగి మెల్లఁగ నరిగెడు ♦ నీరదములు
చల్లఁగా ఫాల మంటుచుఁ ♦ జనెడుగాలి
యెల్ల నీప్రేమకాని వే ♦ ఱేమి గాదు.

పరమపూరుష ! ప్రియతమ ! ♦ ప్రాణనాథ!
నీవు నామది కనుపుసం ♦ దేశ మగుచు
వరదగాఁజొచ్చెఁ గనులఁ బ్రా ♦ భాతకాంతి
మించునీమోముపైనుండి ♦ వంచి తీవు;
గ్రాలునీకంటిచూపు నా ♦ కనుల వ్రాలె;
భక్తితో నామనంబు నీ ♦ పాదమంటె.

## 60

పారమేలేనిసంసార ♦ వార్ధితీర
మందుఁ జేరిరి పిల్లలా ♦ నందముగను;
మీఁద శాంత మనంతమౌ ♦ మిన్ను పొదలె;
జలధి ఘోషిల్లుచుండె వి ♦ శ్రాంతి గనక;
పారమేలేనిసంసార ♦ వార్ధి తటిని
వేడ్కనుం ద్రాట పాటలఁ ♦ బిల్ల లెపుడు.
ఇసుకచే నిండ్లఁ గట్టుచు ♦ నెసఁగుచుంద్రు;
వట్టిగుల్లలతో నాడి ♦ వఱలుచుంద్రు;
ఎండుటాకులఁ బడవల ♦ నెలమి నల్లి
నగుచు విడుతురు తేల సం ♦ ద్రమ్ముమీఁదఁ;
బారమేలేనిసంసార ♦ వార్ధితటిని
వేడ్కతో నాడుచుందురు ♦ పిల్ల లిట్లు.
ఈఁద నెఱుఁగరు వలవైచి ♦ యెఱుఁగ రెపుడు;

ముత్తెములఁ దీయువారలు ♦ ముత్తెములకు
మునుఁగుచుందురు మున్నీట ♦ముదముతోడ;
నరుగుదురు నావ లెక్కి బే ♦ హార్లుగాని
పొందుగా గుల్కరాళ్లను ♦ బ్రోగుసేసి
చల్లుచుందురు మాటికిఁ ♦ బిల్ల లెలమి;
దాఁగుసిరులను వెదుకంగఁ ♦దలఁప రెపుడు;
వలలు వైచుట యెట్టిదో ♦ తెలియకుంద్రు.
వార్ధి పకపక నవ్వెన ♦ పగిది పొంగు.
తీరసుస్మేరమొప్పను ♦ దెల్లఁగాను.
అంత మొదవించుశక్తితో ♦ నలరు నలలు
పిల్ల నిడి తొట్ల నూఁపెడు ♦ తల్లివోలెఁ
బాడు నర్థములేనట్టి ♦ పాట లెపుడు
హాయిగా బాలు రెంతయు ♦ నాలకింప.
తోయనిధి యాడుఁ బిల్లల ♦ తోడఁ గూడి;
తీరసుస్మేర మొప్పను ♦ దెల్లఁగాను.
పారమేలేనిసంసార ♦ వార్ధితటిని
వేడ్కతోఁ గూడి యుందురు ♦ పిల్ల లెల్ల;
విపథమై పొల్చుచుండెడు ♦ వింటియందుఁ
గడఁగి సంచార మొనరించు ♦ గాలివాన;
దుష్పథంబైనవార్ధిని ♦ దూలి తూలి
విఱుగుచుండును నావలు ♦ విఱుగుచుండు ;

మృత్యుదేవత స్వేచ్ఛఁ జ ♦ రింపఁ జొచ్చె ;
వేడ్కతో నాడుచున్నారు ♦ పిల్ల లెల్ల ;
పారమే లేనిసంసార ♦ వార్ధితటిని
వేడ్కతోఁ గూడుచున్నారు ♦ పిల్ల లెల్ల.

## 61

శిశువు కన్నులఁ గదలుచుఁ ♦ జెలఁగు నిద్ర
వచ్చు నెటనుండి తెలిసిన ♦ వారు గలరె ?
ప్రేమఁ గిన్నరవరు లుండు ♦ గ్రామమందు
మిణుఁగురుఁబురుంగు మిన్కుల ♦ మించుచుండు
చారుతరపుణ్యకానన ♦ చ్ఛాయలందు
విమలమోహనమూర్తులై ♦ వ్రేలుచుండు
నిగ్గులఁ జలించునా రెండు ♦ మొగ్గలందు
నది వసించెడు నని జను ♦ లనుచునుండ్రి.
శిశువుకన్నుల ముద్దిడి ♦ చెలఁగుకొఱకు
వచ్చునిద్దుర యటనుండి ♦ వచ్చుచుండు.
నిదురపోయెడిశిశువు కెం ♦ పెదవులందుఁ
జెన్నుమీఱఁగఁ జలియించు ♦ చిన్ననవ్వు
పుట్టు నెచ్చటఁ దెలిసిన ♦ పురుషుఁ డున్నె ?
మంచుగప్పినవేకువఁ ♦ గాంచుకలను
సంతరించు శరన్మేఘు ♦ సంచలమును

నర్ధచంద్రునివెలిమిను ♦ కంటినపుడు
మించునీచిన్నినవ్వు జ ♦ న్మించెఁ దొలుత
ననుచు నుందురు జను లిల ♦ ననుచునుంద్రు.
శిశువు సర్వాంగములయందుఁ ♦ జేరి యలరు
మృదుమధురమైనక్రొంజిగి ♦ యింతవఱకు
నెచట డాఁగెనొ యెవఁడేని ♦ నెఱిఁగి యున్నె?
తల్లి చిఱుకన్నియగ నుండు ♦ తఱిని నిద్ది
కోమలావ్యక్తగూఢన ♦ త్ప్రేమఁ గూడి
యామెహృదయాన వ్యాపించి ♦ యణఁగి యుండె.

62

పలుతెఱంగులరంగులఁ ♦ గలసి వెలుఁగు
క్రీడవస్తువులను నీకుఁ ♦ బ్రీతి నిడిన
యపుడు తెలియును నాకు నో ♦ యనుఁగుబి
యిన్నిరంగులు మేఘాల ♦ నేలఁగలవొ?
యిన్నిరంగులు నీటిలో ♦ నేలఁగలవొ?
పూలలో నేల రంగులు ♦ పొదుగఁబడెనొ.
ఆడుటకు నిన్నుఁ గొల్ప నేఁ ♦ బాడఁదొడఁగు
నపుడు తెలియును నాకు నో ♦ యనుఁగుబిడ్డ!
యేల నాకులలో గాన ♦ లీల గలదొ?
యేల నాలించు భువి హృద ♦ యమ్ము సోఁకఁ

దరఁగ నెల్లను దమతమ ♦ ధ్వనులఁ గూర్చి
పల్లవులఁ జేసి పంపఁగాఁ ♦ బాటుపడునో.
ఆశతోఁ గూడియున్ననీ ♦ హస్తములను
మధుర మైనపదార్థముల్ ♦ మమత నిడిన
యపుడు తెలియును నాకు నో ♦ యనుఁగుబిడ్డ !
యేల విరిగిన్నెలోఁ దేనె ♦ గీలుకొనెనో
యేల గోప్యమ్ముగా ఫల ♦ జాలమందు
నేర్పుతో మంచిరసములు ♦ గూర్పఁబడెనో.
పూని నవ్వింప నీమోము ♦ ముద్దుగొన్న
యపుడు తెలియును నాకు నో ♦ యనుఁగుబిడ్డ !
వేకువను నింగిపైనుండి ♦ వెడలుకాంతి
యందుఁ బ్రవహించుసంతోష ♦ మనఁగ నేమొ
వేసవిని గాలి నన్నంట ♦ వీచినప్పు
డందుఁ గలిగినయానంద ♦ మనఁగ నేమొ.

63

తెలిసియుండనిమిత్రులఁ ♦ దెలియఁజేసి
నావి గానట్టిగృహములఁ ♦ దావు లొసఁగి
పరిచయము లేనివాని సో ♦ దరునిఁ జేసి
దూరమును దగ్గఱగఁ జేయు ♦ దొరవు నీవు.
ఉండి పరిచయమైనట్టి ♦ యునికి వీడ

మదికి నెంతయు నాయాన ♦ మొదవుచుండుఁ;
గ్రొత్తలోఁ బ్రాఁత యుంటయుఁ ♦ గూర్మితోడ
నీవునుం గూడి యుంటయు ♦ నేను మఱతు.
పరిచయము లేనివానితో ♦ భవ్యమైన
హార్ద బంధమ్ము నాయాత్మ ♦ కమరఁ గొల్పి
నెమ్మిఁ దుదలేనినాజీవి ♦ తమ్మునందు
నేకమిత్రుఁడవై యుండి ♦ యొసఁగునీవె
యిచటఁ గాని మఱెచ్చట ♦ నేనిఁగాని
జననమరణాదులందునా ♦ సరస నుండి
నన్ను నడిపించుచుందువ ♦ నాథనాథ !
నిన్ను నెఱిఁగిన నిఁక నున్నె ♦ భిన్నబుద్ధి?
తెఱవఁబడుఁ దల్పులన్నియుఁ ♦ దెఱవఁబడును
పెక్కులీలల నొక్కఁడై ♦ వెలయునీదు
ప్రవిమలస్పర్శ కేను దూ ♦ రంబుగాక
యుండఁ గోరెదునాకోర్కి ♦ పండనిమ్ము.

64

చేరి నేనొకనిర్జన ♦ సీమయందు
నేటవాలుగఁ బ్రవహించు ♦ నేటియొద్దఁ
గడుఁ బొడుగుగాఁగఁ బెరిఁగిన ♦ గడ్డిలోన
నిలిచి యిట్లంటి నామెతో ♦ నెలమితోడఁ;

‘‘గొంగునీడను దీపంబు ♦ గూర్చి యిట్టు
లెచటి కేగెదు? కన్నెరో! ♦ యెఱుఁగఁ జెపుమ.
ఉండె నాయిల్లు చీఁకటి ♦ నొంటిగాను;
ఇమ్ము దీపమ్ము కన్నెరో! ♦ యిమ్ము నాకు.’’
అన్న నల్లనికన్నుల ♦ నట్టె యెత్తి
మసకలోఁ జూచి నామోము ♦ మగువ యపుడు
తరణి పడమటఁ గుంకిన ♦ తఱిని నేట
దీపమును దేల్ప వచ్చితిఁ ♦ దెలియు మనియె.
గడుఁ బొడవుగాఁగఁ బెరిగిన ♦ గడ్డిలోన
నొంటిగా నేను నిలఁబడి ♦ యుండి యుండి
కాంచితిఁ జలించుదీపంబు ♦ గంగలోన
నూరకే కొట్టుకొనిపోవు ♦ చుంట; నంత
రాత్రి నిశ్శబ్ద మగుడు నా ♦ రమణితోడఁ
‘‘కన్నెరో! నీదుదీపమ్ము ♦ లన్ని వెలిఁగె
నెచటి కేగెదు దీపమ్ము ♦ నింకఁ గొనుచు?
నుండె నాయిల్లు చీఁకటి ♦ నొంటిగాను.
ఇమ్ము దీపమ్ము కన్నెరో! ♦ యిమ్ము నాకు.’’
అన్న నల్లనికన్నుల ♦ నట్టె యెత్తి
వదన మీక్షించి సంశయ ♦ పడుచు నిలిచి
‘‘దివికి నంకితముగ నాదు ♦ దీప మియ్య
వచ్చినా’’ నని కడపటఁ ♦ బలికె నామె.

వ్యర్థగ నాకన్నె దీపంబు ♦ వెలుఁగుచుండ
నిలిచి చూచితి నేనును ♦ నిలిచి నిలిచి.
రజనిపతి లేనియామధ్య ♦ రాత్రియందు
"అమ్మ! దీపమ్ము నీహృద ♦ యమ్ముకడను
బెట్టి కన్నెరో! నీవేమి ♦ వెదకె దిపుడు?
ఉండె నాయిల్లు చీఁకటి ♦ నొంటిగాను
ఇమ్ము దీపమ్ము కన్నెరో? ♦ ఇమ్ము నాకు."
అన్న నిలఁబడి తలఁపోసి ♦ యాస్యమందుఁ
జీఁకటిం దృష్టి పఱపి యా ♦ చెలువమిన్న
"నెమ్మి దీపంబు దీపోత్స ♦ వమ్మునందుఁ
జేర్పఁ దెచ్చితి" ననుచుఁ దాఁ ♦ జెప్పి పోయె.
నామె చిన్ననిదివ్వె దీ ♦ పాళిలోనఁ
గాలిపోవంగ వ్యర్థమై ♦ కన్నులారఁ
జూచుచుండితి నిలఁబడి ♦ చూచుచుంటి.

## 65

అభవ! యీనాదుజీవిత ♦ మనెడునట్టి
నిండితొల్కాడుగిన్నెలో ♦ నుండి దేవ!
యేమధురదివ్యరసమును ♦ బ్రేమతోడఁ
గ్రోలుకోరికి యున్నదో ♦ కూర్మిఁ జెపుమ!
ఓకవీంద్ర! మదీయవి ♦ లోకనముల

నీదుసృష్టిని గనుటయు ♦ నాదుచెవుల
వాఁకిళుల నిల్చి నీనిత్య ♦ పరమశాంతి
వినుటయును నీకు వేడ్కలై ♦ వెలసియున్నె!
నీజగము నామనంబున ♦ నేర్పుతోడ
నల్లుచున్నవి పదముల ♦ నందముగను;
నీప్రమోదమ్ము వానికి ♦ నింపు నింపు;
నెన్నఁగాఁగానిప్రేమతో ♦ నిన్ను నీవె
నాకు నొసఁగుచునాయందె ♦ నాథ నీవు
పొందుచుందువు నీపరి ♦ పూర్ణసుఖము.

66

సంజ మిణుకుమిణు క్కను ♦ సమయమునను
మద్గభీరతలమ్మున ♦ మానసట్టి
వేకువనుగూడ ముసుఁగును ♦ వీడనట్టి
దానినుంచి మదీయాంత ♦ గానమందు
నెలమిఁ దుదికాన్కగా నీకు ♦ నిడెద దేవ!
పలుకులు వరించి మెప్పును ♦ బడయ దయ్యె;
హస్తములు చాచె బోధన ♦ వ్యర్థముగను
బదిలముగఁ బెట్టి దీని నా ♦ హృదయమందు
దేశదేశమ్ము లెల్లను ♦ దిరిగినాను;
దీనఁ గడచెను నాదువృ ♦ ద్ధిక్షయములు;

పనులఁ దలఁపుల నిద్రల ♦ స్వప్నములను
నీమొయే యేలుచుండియు ♦ నేకతముగఁ
దొలఁగియే యుండు నెప్పుడుఁ ♦ దొలఁగి యుండు ;
నెందఱో యీమెకొఱకు నా ♦ యిల్లు సేరి
యరుగుచుందురు తుదకు ని ♦ రాశఁ జెంది.
ఈమెను ముఖాముఖం జూచి ♦ యెఱుఁగ రెవరు;
నీదుసమ్మతి నొంది తా ♦ నెగడుటకును
వేచి యున్నది యొంటిగా ♦ వేచి యుండె.

67

నీవె యాకసమును మఱి ♦ నీవె గూఁడు.
నీదుప్రేమయె గూఁటిలో ♦ నెగడుజీవుఁ
జిత్రవర్ణమ్ములను మఱి ♦ చిత్రశబ్ద
చిత్రగంధమ్ములం గూర్చుఁ ♦ జిత్రరూప !
మహికి మకుటోత్సవము సల్ప ♦ మౌననియతి
విమలసౌందర్యహారంబు ♦ వెట్టి యున్న
పైఁడిబుట్టను గుడిచేతఁ ♦ బట్టి వచ్చు
భవ్యతరముగ సతము ప్రా ♦ భాతవనిత.
పసులమందలు వీడిన ♦ బయళులందు
జాడ లేనట్టిత్రోవలఁ ♦ జల్లఁగాను
శాంతపశ్చిమజలధిప్రా ♦ శాంతజలము

నించి బంగారుకుండలో ♦ నెమ్మిఁ దెచ్చు
సతము సంధ్యాంగనామణి ♦ సౌరుమీఱఁ;
గాని జీవాత్మ యెగయఁగాఁ ♦ గ్రాలుచుండు
నంత మెఱుఁగనియట్టి య ♦ నంతమందు
విమలవిశదసితచ్ఛటల్ ♦ వెలుఁగుఁ గాని
రంగు రూపము పగలును ♦ రాత్రి లనెడు
పలుకులే లేవు చూడనా ♦ స్థలమునందు.

68

నేను గార్చెడుకన్నీట ♦ నేను విడుచు
వేఁడినిట్టూర్పులను నేను ♦ బాడునట్టి
గానములచేత నైనమే ♦ ఘముల నీదు
పాదములకడఁ జేర్పఁగా ♦ నీదుసూర్య
కిరణ మీనాదుభూమిపైఁ ♦ గరముఁ జాచి
నాదు జీవితకాలది ♦ నంబు ముగియు
వఱకు నావాఁకిటను నిల్చి ♦ వఱలు దేవ!
క్రాలుచుక్కలతోడివ ♦ యత్స్థలమునఁ
బలు తెఱంగులముడుతలు ♦ పడెడునట్లు
వివిధరూపంబులను బొంది ♦ వెలుఁగునట్లు
సారెకును దిద్దియెప్పుడు ♦ మారుచుండు
రంగులను రంగువేసి హో ♦ రంగు మీఱఁ

దాల్చుచుందువు మేఘవ ♦ స్త్రంబు దేవ!
తెలికయు మెత్తదనము న ♦ స్థిరతబాష్ప
జలములును నల్లదనమును ♦ జాల నుంటు
దానిఁ బ్రేమింతువు గదా యు ♦ దారచరిత!
కాన నీకేవలశ్వేత ♦ కాంతిమీఁద
జాలిమైఁ గప్పఁ దత్తమో ♦ చ్ఛాయ లెపుడు.

## 69

నాదునాడులయందు న ♦ నారతంబుఁ
బాఱు జీవనపూర మే ♦ పాఱుచుండు
సకలజగములయందును ♦ సంతతంబు
నొక్కతీరున లయ దప్ప ♦ కుండునట్లు.
అదియె పొదలుచుఁ దలయెత్తు ♦ నవనినుండి
పొలుచుపలు తెఱఁగులగడ్డి ♦ పోచ లగుచు;
నదియె యుప్పొంగుఁ బుష్పప ♦ త్రాళియగుచు;
నదియె వృద్ధిక్షయంబుల ♦ నంది చెలఁగు
లోలసంసారసాగర ♦ డోలయందు
నూఁపఁబడుచుండు నెప్పుడు ♦ నూఁపఁబడును.
చేతనాత్మక మైనవి ♦ ఖ్యాతజగతి
యంటుమాత్రిన నాయవ ♦ యవములెల్ల

ధన్యతను గాంచె నంచు నేఁ ♦ దలఁచు చుందు;
నెంతయో కాలమునుబట్టి ♦ హృదయ మంటి
యిపుడు మచ్ఛోణితంబున ♦ నృత్యమాడు
నాయహంభావ మెన్న స ♦ నాతనంబు.

## 70

ఒక్కలయగతి నేగునీ ♦ యుత్సవమున
నలరుటయు భీతిఁ గొల్పెడు ♦ హర్షమనెడు
సుడిని బడి తూలి బ్రిద్దలై ♦ మడియుటయును
నీకు బాహ్యంబు లౌ నేమొ ♦ నాకుఁ జెపుమ.
తిరిగి చూడక నిలువక ♦ తెన్నువట్టి
యన్నియును గొట్టుకొనిపోవు ♦ నద్భుతముగ
వానినాపంగ శక్తి యె ♦ వ్వనికిఁ గలదు?
సకలమునుబోవుఁ బోవుఁ గొ ♦ ట్టుకొని పోవుఁ;
గనకవిశ్రాంతి పాటు నీ ♦ గానగతికిఁ
దగినరీతిని నడుగులఁ ♦ ద్వరగ నిడుచు
వచ్చుచుం బోవుఋతువులు ♦ దెచ్చి తెచ్చి
వర్ణములఁ బాటలను మఱి ♦ పరిమళములఁ
బోయుచుండును నెలయెల్లఁ ♦ బోలె నెవుడు
క్షణములోఁ దూలి పొలయుసౌ ♦ ఖ్యములయందు.

## 71

నన్ను నేఁ బెద్ద యనుకొని ♦ యన్నికడల
రంగునీడల నీప్రభా ♦ రాశిమీఁద
నెలకొలుపుచుండు నిదె గదా ♦ నీదుమాయ.
నీవె నీలోనిభాగంబు ♦ నెమ్మిఁ దీసి
పిలుతు వద్దాని నెన్నియో ♦ పేళ్లచేత ;
నీవిభాగమె నాదునా ♦ కృతిని గాంచె ;
గగనమంతటనుండి యీ ♦ కరుణగీతి
ప్రతిరవము లీనుఁ జిత్రబా ♦ ష్పములయందు
హా ర్షభయములయందును, ♦ నాశలందు;
వీచికలు మాటిమాటికి ♦ లేచి పడును ;
గలలు విరియుచు వెండియుఁ ♦ గలుగుచుండు ;
నీవు నాయందు నోడుదు ♦ నీకు నీవె.
ఈ వొనర్చిన తెరమీఁద ♦ నెన్నియేని
చిత్రములు వ్రాయఁబడియె వి ♦ చిత్రముగను
మించు రేయుంబవళ్లను ♦ కుంచెతోడ.
గనఁగ విసు గగునరళ రే ♦ ఖలను వీడి
యతివిచిత్రపువంపుల ♦ నల్లఁబడిన
నీదుపీఠంబు తెరవెన్క ♦ నెగడుచుండు.
నీకు నా కగుబందుగ ♦ నింగిఁ బర్వ ;

గాలి నీ నా సమశ్రుతి ♦ గలసి మ్రోఁగెఁ ;
బొదలి మన మాడుదాఁగుడు ♦ మూఁతలాట
కున్నె యంతమ్ము కాలమ్ము ♦ లెన్ని చన్న.

72

అతినిగూఢంబుగా నన్ను ♦ నంటి యంటి
ప్రకట మానట్లు ననులేపు ♦ ప్రభు వనంగ
నంతరాంతరమందు ను ♦ న్నట్టియతఁడె.
నాదునేత్రాలపై మంత్ర ♦ మూఁదుచుండి
వివిధసుఖదుఃఖమూర్ఛనల్ ♦ నెలయు నట్లు
నాదుహృత్తంత్రులను మహా ♦ నందముగను
వాటముగ మీటుచుండెడు ♦ వాఁడు నతఁడె.
ఎంతయును జంచలం బయి ♦ యొసఁగుచుండు
నీలసితపీతహరితవ ♦ ర్ణాలిచేత
మాయ యనుజాలమును సదా ♦ నేయు చుండి
దేని నంటిన మఱతునో ♦ నేను నన్నె
యట్టితనచరణాబ్జమ్ము ♦ లందముగను
మాయముడుతలలోనుండి ♦ మానసాక్షి
పథమునకు గోచరము సేయు ♦ వాఁడు నతఁడె.
ఎంతకాలము వచ్చిన ♦ నెంత చన్న
నామముల నెన్నియోరూప ♦ ధామములను

మోదములను మఱెన్నియో ♦ ఖేదములను
సతము నామదిఁ గోల్పెదు ♦ స్వామి యతఁడె.

73

ముక్తి నేఁ గోర నెపుడు వి ♦ రక్తి యందుఁ
బ్రిమద మొసఁగెడు వేనవేల్ ♦ బంధనముల
మోక్షపరిరంభణసుఖంబె ♦ పొడము మదికి.
వివిధవర్ణసుగంధముల్ ♦ వెలసి యున్న
క్రొత్త ద్రాక్షారసమ్మును ♦ గూర్మితోడ
వంచి తిన్నగ నాదుమ్రు ♦ త్పాత్రియందు
నిరతమును బోయుచుందువు ♦ నిండునట్లు.
తావకజ్వాలచేత వం ♦ దలకొలంది
వివిధదీపాల వెలిగించి ♦ వింత గదుర
దేవ ! నీయాలయంబున ♦ దివ్యపీఠి
ముందుఁ బెట్టును నాజగ ♦ మందముగను.
మాయ నాయింద్రియద్వార ♦ ములను మాయ
గన్నుఁ జెవియును స్పర్శంబుఁ ♦ గాంచుసుఖము
నీసుఖంబును వహియించు ♦ నిక్కమముగ.
నాదుమాయావినోద మా ♦ నందతేజ
మగుచు వెల్గును నాయాశ ♦ లన్నిగూడఁ
బక్వమగుప్రేమఫలము లై ♦ పరిణమించు.

## 74

పగలు ముగిసెను ; భూమిపైఁ ♦ బడియె నీడ ;
సమయ మయ్యెను గడవలో ♦ జలము నింపి
తేఁగ నదికడ కే నరు ♦ దెంచుటకును ;
జాలి యిడునీటిగానము ♦ సంజగాలి
కెంతయును గొల్పెఁ దమకంబు ♦ వింతగాను.
పిలుచు చున్నది మసకలో ♦ పలికి నన్ను ;
సందు నిశ్శబ్దముగ నుండె ♦ జనులు లేమిఁ ;
దెరువరియుఁగూడఁ దెన్నునఁ ♦ దిరుగ కుండె ;
బడలికలు వాపుగాలి వీ ♦ వంగఁ దొడఁగెఁ ;
జిన్నతరఁగలు నదిలోనఁ ♦ జెలఁగఁ జొచ్చె ;
మరలుదునో లేనో యింటికి ♦ నెఱుఁగరాదు ;
తెలియ దెవ్వఁడు నాతోడఁ ♦ గలిసి కొనునో ;
రేవుకడఁ జిన్నపడవలోఁ ♦ బ్రీతితోడ
నెవ్వఁడో గాని వీణ వా ♦ యించె నదిగో !

## 75

యోగ్యముగ మర్త్యు లగుమాప్ర ♦ యోజనములఁ
గూర్మి నెరవేర్చినను గూడఁ ♦ గొఱఁత పడక
మరల నిను జేరఁ బాఱు న ♦ మందగతిని

నీప్రసాదంబు లెల్ల న ♦ నింద్యచరిత !
తనకుఁ గలనిత్యకర్తవ్య ♦ మును నొనర్పఁ
బల్లెలం బొలములఁ జొచ్చి ♦ పఱచి కూడ
నెడ తెగక పాఱునేఱు నీ ♦ కడకె మరలఁ
గడకు నీపాదకమలముల్ ♦ గడుగుకొఱకు.
విరివిరిసి చక్కగాఁ దన ♦ పరిమళమును
గాలిలోపలఁ గమ్మగాఁ ♦ గ్రమ్మికూడఁ
గొనకుఁ దను నీకు నర్పించు ♦ కొనుటె తనకు
నంత్యకర్తవ్యముగ నెంచు ♦ నమలచరిత !
పొందునె కొఱంత జగము నీ ♦ పూజవలన ?
కవులు పలుకుచునుండువా ♦ క్యముల కవని
నెవ్వ రేయర్థ మొనరించి ♦ రేనిఁగూడ
వానిఫలితార్థ మెల్ల నీ ♦ వైపె చూపు.

76

నాఁడునాఁటికి నాప్రాణ ♦ నాథ ! నేను
నీముఖాముఖి నిలువఁగా ♦ నేర్తుఁ గాక !
చేతులను గట్టుకొని జగ ♦ జ్జ్యోతి వైన
నీకు నేను ముఖాముఖి ♦ నిలుతుఁ గాక !
కడువిశాలంపునీదు నా ♦ కసముక్రింద
నేకతంబుగ మౌనంబు ♦ నే ధరించి

వినయ మొప్పెడుమదితోడ ♦ వెలయు చుండి
నీముఖాముఖి నెప్పుడు ♦ నిలుతుఁ గాక !
తమపనులఁ బోరుజనులసం ♦ దడిని గలిగి
కూడి వడివడిఁ జనియెడు ♦ గుంపు గలిగి
పాటుతో నిండియుండు నీ ♦ వసుధయందు
నీముఖాముఖి నెప్పుడు ♦ నిలుతుఁ గాక !
జగములోపల నాపని ♦ ముగిసి నపుడు
మాటలాడక యొంటిగా ♦ మౌననియతి
నీముఖాముఖి నోప్రభు ! ♦ నిలుతుఁ గాక !

77

నాకు దేవుండ వీవని ♦ నాథ ! తెలిసి
తొలఁగి నిలుతును గొంచెము ♦ తొలఁగి నిలుతు.
నీవు నాస్వంతమే యను ♦ నెఱుక లేక
చేరకుండుదు దగ్గఱఁ ♦ జేరకుండు.
నాకుఁ దండ్రివి నీవని ♦ నాథ ! తెలిసి
యేను నీచరణంబుల ♦ కెఱఁగు చుందు.
స్నేహితునివలె నీచేతఁ ♦ జేయి నేను
గలప కుండుదుఁ జేతిని ♦ గలప కుండు.
నీవు నాస్వంత మనునట్లు ♦ నిన్నె నాకు
మిత్రునిగ నెంచి మదిఁ జేర్చి ♦ మించునట్లు

నీవు చనుదెంచుచోట నే ♦ నిలువ లేదు.
భ్రాతలందెల్ల భ్రాత వై ♦ వరలు దీవు ;
కాని వారల నెవరిల ♦ క్ష్యంబుసేయ ;
నో మహాప్రభు ! నీతోడ ♦ నున్నదెల్లఁ
బంచికొనినట్లు గాఁగ నే ♦ వారితోడఁ
బంచుకొనలేదు కూర్చిన ♦ భాగ్యములను.
అధిప ! నీకడనిల్చిన ♦ యట్లు గాఁగ
జనులసుఖదుఃఖములయందు ♦ సరసఁ జేరి
నిలువలేదు నిజంబుగ ♦ నిలువ లేదు.
ఒసఁగఁ బ్రాణంబు వెనుదీయు ♦ చున్నవాఁడఁ ;
గాన జీవనజలధి మ ♦ గ్నంబుఁ గాక
యున్నవాఁడను దీనుఁడై ♦ యున్నవాఁడ.

78

సృష్టియంతయుఁ గ్రొత్తగఁ ♦ జెలఁగునాఁడు
చుక్కలెల్లను నెంతయు ♦ శుభ్రమైన
తొలివెలుఁగుచేతఁ దళతళ ♦ వెలుఁగుచుండ
నింగి సభదీఱి దేవతల్ ♦ నెమ్మిఁ బాడి
“ రహహా ! పూర్ణస్వరూపమా ! యమలమైన
యద్భుతానందరూపమా ” ♦ యంచు మించి
“ కాంతిపఙ్క్తిని నొకవెల్తి ♦ కాన వచ్చె ;

నకట! యొకచుక్క జాఱిన ♦ యట్లు దోఁచె"
నంచు నెల్లత్తి వారిలో ♦ నఱచె నొకఁడు.
"వీణబంగరుతీగియ ♦ వీడి పడియె;
రాగతాళంబు లన్నియు ♦ నాఁగిపోయె.
ఓహో! జాఱినచుక్క న ♦ రోత్తమంబు
గగనమునకెల్ల మణియయి ♦ కాంతులు చుండె"
నంచునాశ్చర్యమున నంద ♦ ఱఱచి రపుడు.
నాఁటినుండియు వా రెల్ల ♦ చోటులందు
వెదకుచుందురు దానికై ♦ విడువకుండ.
"జగమునకు దానితో నొక్క ♦ నగయె తొలఁగె"
ననెడుమాటయె వారిలో ♦ నల్లుకొనియెఁ;
గాని నిశ్శబ్దనిశిఁ దమ ♦ లోనఁ దామె
గుసగుసలువోయెఁ జుక్కలు ♦ కూడి నగుచు
వెదకుటెల్లను దానికై ♦ వృథయవృథయ
దేనిలో నది సంపూర్ణ ♦ మైన దంచు.

## 79

దేవ! నిన్గాంచుభాగ్య మీ ♦ జీవితమున
నేను గనఁజాల నేని యో ♦ దీనరక్ష!
"తప్పితిని నీదుదృష్టికిఁ ♦ దప్పితి" నని
యెప్పుడును నాదుమదిలోన ♦ నెంచ నిమ్ము.

# గీతాంజలి.

ఒక్క క్షణమైన మఱవక ♦ యుండ నిమ్ము.
స్వప్నజాగ్రదవస్థల ♦ స్వామి ! నేను
దారుణం బగునీచింతఁ ♦ దాల్పనిమ్ము.
జగ మనెడునట్టియీ గొప్ప ♦ సంతయందుఁ
గడపుచుండఁగఁ గాలంబుఁ ♦ గరములందు
నే గడించినలాభంబు ♦ నిండి నపుడు
చూడ నాయార్జనంబెల్ల ♦ శూన్య మంచు
నెప్పుడును నాదుమదిలోన ♦ నెంచ నిమ్ము.
ఒక్క క్షణమైన మఱవక ♦ యుండ నిమ్ము.
స్వప్నజాగ్రదవస్థల ♦ స్వామి ! నేను
దారుణం బగునీచింతఁ ♦ దాల్ప నిమ్ము.
బడలి రోజుచుఁ ద్రోవకుఁ ♦ బ్రక్కయందుఁ
గూరుచుండినయప్పుడు గూరుకొనఁగఁ
బఱపుదుమ్మున నేలపైఁ ♦ బఱచు నపుడు
పయన మింకను బహుదూర ♦ మయిన దంచు
నెప్పుడును నాదుమదిలోన ♦ నెంచ నిమ్ము.
ఒక్క క్షణమైన మఱవక ♦ యుండ నిమ్ము.
స్వప్నజాగ్రదవస్థల ♦ స్వామి ! నేను
దారుణం బగునీచింతఁ ♦ దాల్ప నిమ్ము.
గదులు కైసేతలను గాంచి ♦ క్రాలినపుడు
వేణుహృద్యనినాదముల్ ♦ వెలసినపుడు

పక్కమనినవ్వుశబ్దముల్ ♦ పర్వినపుడు
పిలువనైతిని నిన్ను నా ♦ నెలవు కంచు
నెప్పుడును నాదుమదిలోన ♦ నెంచ నిమ్ము.
ఒక్కక్షణమైన మఱవక ♦ యుండ నిమ్ము.
స్వప్నజాగ్రిదవస్థల ♦ స్వామి! నేను
దారుణం బగునీచింతఁ ♦ దాల్ప నిమ్ము.

80

అంబరమ్మున నెంతయు ♦ వ్యర్థముగను
సంచరించెడుశరదభ్రి ♦ శకల మట్లు
నాథ! యున్నాఁడ నిర్మలానంత తేజ!
దేవ! నేను భవచ్ఛుభ్రి ♦ తేజమందు
లీన మైపోవునట్లు నా ♦ లోనియావి
నంటి నీ వింకఁ గఱగింప ♦ కుంట నీకు
వెలిగ నే నుండి లెక్కింతు ♦ నెలలు నేండ్లు.
ఇదియె నీయాట యిదియె నీ ♦ యిచ్ఛయేని
వట్టిదియుఁ జంచలంబు నై ♦ నట్టినన్ను
బలు తెఱంగులరంగుల ♦ నలరఁ జేసి
పొలుచు చుండెడుబంగరు ♦ పూఁతఁ బూసి
సోలి యాడెడుగాలిపైఁ ♦ దేలఁ జేసి
నెఱపు మెన్నియొవింతల ♦ నేర్పుమీఱ.

రాత్రి నీయాటఁ జాలింప ♦ రాజ! నీవు
దలఁచితేనియు గాఢమౌ ♦ ధ్వాంతముననో
యమలప్రాభాతవిస్మృత ♦ మందు నేని
స్వచ్ఛతరమై వెలింగెడు ♦ శైత్యముననో
కలసిపోవుదుఁ గనులకు ♦ గాన రాక.

## 81

ఎన్నియో మార్లు తోఁచక ♦ యున్నవేళ
వమ్ముగాఁ బుచ్చి నట్టికా ♦ లమ్ముఁ గూర్చి
యుల్లమున నేఁ గరమ్ముఁ జిం ♦ తిల్లినాఁడఁ;
గాని నా కాల మూరక ♦ కడవ లేదు.
దేవ! నాజీవితమునఁ బ్రి ♦ తిక్షణమును
స్వయముగా నీకరమ్ములఁ ♦ బట్టినావు.
అన్నిఁటను గల్గి లోలోన ♦ నలరుచుండి
పూన్కితో విత్తనమ్ముల ♦ మొలకలుగను,
మొగ్గలను సొంపుగుల్కెడు ♦ పువ్వులుగను,
బూల ఫలములుగాఁ జేసి ♦ ప్రోతు వీవు.
బడలి తోఁచక పాన్పుపైఁ ♦ బండి యుండి
యాఁగెఁ బనులెల్ల ననుకొంటి ♦ హాయిఁ గంటి
లేచి వేకువఁ దోఁటను ♦ జూచుసరికి
వింతవింతల విరులచే ♦ వెలసి యుండె.

82

నాథ ! నీచేతఁ గాల మ ♦ నంత మగును.
నీక్షణంబుల లెక్కింప ♦ నేర్చు నెవఁడు ?
వడిగ రేయుంబవళ్లును ♦ గడచుచుండు.
విరులవలెను యుగంబులు ♦ విచ్చివాడు.
దేవ ! వేచుట యన నేమొ ♦ తెలియు నీకె.
ప్రథమదశ నుండుసన్నని ♦ వనసుమంబు
పూర్ణపరిణామమును బొంది ♦ పొదలుటకును
బైఁబయిని నెన్నియో శతా ♦ బ్దములు గడచు
వమ్ముగాఁ బుచ్చ మాకుఁ గా ♦ లమ్ము లేమి
వృథగఁ దరుణముఁ బోనీక ♦ పెనగవలయు
జాల మొనరింప మాకంత ♦ కాలమున్నె ?
వచ్చి మొఱలిడు ప్రతివాని ♦ కిచ్చుచుంటఁ
గాల మంతయు వ్యర్థమై ♦ కడచిపోవు.
కొనకు నాకాన్క నీపీఠ ♦ మునకు రాక
కాలమెంతయు వ్యర్థమై ♦ కడచిపోవు.
అంత నిలుపక నేను ది ♦ నాంతమందుఁ
తలుపు మూయుదు రనుభీతిఁ ♦ ద్వారగవత్తుఁ
గాని యింకను గాలంబు ♦ గలిగి యుండు.

83

శోకబాష్పాళిచే మాత! ♦ నీకు నొక్క
కంఠహారంబు నిచ్చెదఁ ♦ గాన్కగాఁగ
దమపరికాశంబుచేతను ♦ దార లెల్ల
నీదుచరణంబులను గూర్ప ♦ నెమ్మితోడ
నందెలొనరించెఁ గాని నీ ♦ యక్కునందు
వరలి వ్రేలాడు నేనిడు ♦ సరముసుమ్ము.
వచ్చు నీనుండి కీర్తియు ♦ భాగ్య మెపుడు
నిచ్చుటయు నీయకుంట నీ ♦ యిచ్చ నుండు
నాదుశోకము మాత్రము ♦ నాద నాదె.
దీని కాన్కగ నీకు నేఁ ♦ దెచ్చినపుడు
నీకరుణచేత నన్ను మ ♦ న్నింతువీవు.

84

అంతటను నిండియుండి య ♦ నంతమైన
గగనమునఁ బెక్కురూపముల్ ♦ గలుగఁజేయు
నదియును వియోగచింతయే ♦ యరసి చూడ.
సతము రాత్రులయందు ని ♦ శ్శబ్దముగను
జుక్కలోనుండి చుక్కను ♦ జూచుచుండి
వర్ష రాత్రుల నాకుల ♦ వలనఁ గలుగు

శబ్దముల యక్షగానంబు ♦ సలుపుచుండు
నదియును వియోగచింతయే ♦ యరసిచూడ.
మాటిమాటికి మనుజుల ♦ మందిరముల
ఖేదమోదానురాగవాం ♦ ఛాదు లగుచు
మర్త్యవిత్వప్వాదంతర ♦ మార్గమునను
బాటగఁ గరంగి సతతముఁ ♦ బాఱుచుండు
నదియును వియోగచింతయే ♦ యరసిచూడ.

## 85

నాథుభవనమునుండి యీ ♦ యోధవరులు
గడగి యని కయి తొలుదొల్త ♦ వెడలినపుడు
తమబలము నెల్ల నెచ్చట ♦ దాచి చనిరి?
శస్త్రకవచంబు లెచ్చట ♦ జాఱి పడియె?
ప్రభునివాసంబునం దుండి ♦ వచ్చునపుడు
వార లుండిరి యనదల ♦ పగిదిఁజూడ.
శరపరంపర వారిపైఁ ♦ గురిసి యుండె.
స్వామిభవనము మరి చేరఁ ♦ జనెడునపుడు
తమబలములెల్ల నెచ్చట ♦ దాచి చనిరి?
ఖడ్గశరచాపములు వారి ♦ కడను లేవు
నుదుటిపై శాంతరసము సొం ♦ పొదవి యుండె
మరల విభుమందిరముఁ జేరఁ ♦ దరలునపుడు

వదలి యుండిరి జీవిత ♦ ఫలము లెల్ల.

86

చేరి వాఁకిట మిత్త్రి నీ ♦ సేవకుండు
నెఱుఁగరానట్టిసందర్భంబు ♦ నెలమి దాఁటి
దేవ! నీయాజ్ఞ నిదె నాకుఁ ♦ దెచ్చినాఁడు;
కటిక రాతిరిఁ జిమ్ముచీఁ ♦ కటులు గ్రమ్మె;
నాత్మ చలియించె భీతిచే ♦ నైన నేను;
దీపమును గొని తలుపులఁ ♦ దెఱచివైచి
స్వాగతం బిచ్చి మ్రొక్కెద ♦ సంతసమున
వాఁకిటను వచ్చి నిలిచిన ♦ వాఁడుచూడ
నీవు పంపిన దూతయై ♦ నెగడుచుంటఁ;
గరములను మోడ్చి కన్నీరు ♦ గ్రమ్ముచుండ
నతని బూజింతు నెంతయు ♦ నర్థితోడఁ;
జరణములజిత్త్రకోశంబుఁ ♦ దెఱచి పెట్టి
యతని బూజింతు నెంతయు ♦ నర్థితోడఁ
దానువచ్చినపని తీర్చి ♦ తరలునతఁడు
నాదుప్రాభాతమున నిల్పి ♦ నల్లనీడ.
పాడువడినట్టి నాయింట ♦ వదలఁబడిన
నేను మాత్రమె నీతుది ♦ కానుక యయి
నిలిచి యుండుదు నోనాథ! ♦ నిలిచియుందు.

87

కట్టకడపటియాశతో ♦ గదిని జేరి
యామెకయి మూలమూలల ♦ యందు వెదకి
కాననైతిని నేనామెఁ ♦ గాననైతి.
ఇల్లు చిన్నది పోయిన ♦ దెద్దియైనఁ
గానఁబడ దెన్నటికినైనఁ ♦ గానఁ బడదు ;
నీదుభవన మనంతమై ♦ నెగడుఁ గాన
స్వామి యామెను వెదుకంగ ♦ వచ్చినాఁడ ;
నీదుసంధ్యాంబరంబను ♦ నిగ్గులొల్కు
పైఁడిమేల్కట్టునీడలో ♦ పలను నిల్చి
నేను దమి నిక్కి చూచెద ♦ నీముఖంబు ;
నిత్యమను వార్ధితుదిఁ జేరి ♦ నిలిచినాను
దానిలో నాశ మెద్దాని ♦ కేని లేదు.
కంటిలోపల నశ్రువుల్ ♦ గ్రమ్మియుంట
నాశ గాని మరెట్టిసౌ ♦ ఖ్యంబు గాని
యేముఖచ్ఛాయ గాని నా ♦ కెఱుఁగరాదు.
ఏమియును లేక వట్టిగా ♦ నెసగునన్ను
నమ్మహావార్ధిలోపల ♦ నద్ది యద్ది
పూర్ణమైనట్టి లోఁతులో ♦ ముంచి విడుము
విశ్వమంతట లోపల ♦ విలయమందు

నాసుఖస్పర్శ నొకతూరి ♦ నందనిమ్మా.

88

శిథిలదేవాలయంబునఁ ♦ జెలఁగుదేవ!
నిన్నుఁగూర్చినపాటలు ♦ నెమ్మిత్రోడ
వీణెతంతులు పాడవు ♦ విఱిగియుంట;
స్వామి! నీపూజసమయంబుఁ ♦ జాటవింక
సంజవేళల గంటలు ♦ చప్పుడుడిగి;
గాలి మౌనము ధరియించి ♦ కదలకుండు
జీర్ణభవదీయవాసంబుఁ ♦ జేరవచ్చె
మధురమధుమాసవాతము ♦ మందగతిని;
పూలపరిమళవార్తల ♦ లీలఁదెచ్చెఁ
గాని యాపూలఁ గాన్కగాఁ ♦ గాంచవింక.
మున్ను నీపూజఁ గావించు ♦ చున్నవాఁడు
వరముఁ గనకుండ నింకను ♦ దిరుగుచుండు
ధూమమును నీడలునుబోయి ♦ దుమ్ముఁగలయఁ
సంజవేళను బడలికఁ ♦ జాలిగలిగి
డెంద మెంతయు క్షుద్బాధఁ ♦ గుందుచుండ
శిథిలదేవాలయంబును ♦ జేరునతఁడు.
జీర్ణదేవాలయంబున ♦ జెలఁగుదేవ!
సడియె లేకుండ జరుగును ♦ త్సవములెల్ల

రేలఁ బూజలుగలుగుదీ ♦ పాలె లేక ;
నేర్పరులచేతఁ జక్కఁగాఁ ♦ దీర్పఁబడిన
వేనవేల్కొత్త బొమ్మలు ♦ వెలయఁగలవు ;
వానివానికిఁ గాలంబు ♦ వచ్చినపుడు
శూన్యపావనవాహినిఁ ♦ జొచ్చిపోవు.
బొత్తిగాఁ బూజఁ గనకుండ ♦ బొదలువాఁడు
కేవలముజీర్ణసదనంపు ♦ దేవుఁ డొకఁడె.

89

అఱవకుము కేకవేయకు ♦ మనుచు నన్ను
గోరి యున్నాఁడు నాథుండు ♦ కూర్మితోడ
నింక గుసగుసమాత్రమె ♦ యెసఁగగలదు ;
మనసులోమాట పాటలో ♦ గొనిగిపోవుఁ ;
ప్రభునిసంతకుఁ జనిరెల్ల ♦ వారునిపుడు
అమ్మువారును గొనువారు ♦ నచటఁ గలరు
పనులమధ్యను దినమధ్య ♦ మునను నాకు
సెల వకాలంబులోపలఁ ♦ గలిగెనిపుడు
కాల మిది గాకయున్నను ♦ బూలునాకు
నిచ్చుఁగావుతఁ బూఁదోఁట ♦ నెలమితోడ ;
మట్టమధ్యాహ్న మిప్పుడు ♦ మధుకరములు
వీడిసోమరితమును ♦ బాడుఁగాత !

మేలుకీడులతోఁ జాలఁ ♦ గాల మరిగె.
వ్యర్థదినముల నాతోడ ♦ నాడుకొన్న
వాఁడు నాహృదయంబును ♦ నేఁడు లాగె.
పనికిమాలినయట్టి యే ♦ పనికి నన్ను
నిట్లు తటుకునఁ బిలిచెనో ♦ యెఱుఁగరాదు.

**90**

నీదువాఁకిలి మరణంబు ♦ నిలిచి తట్ట
నేమి యొసఁగెదు కాన్కగా ♦ నీవు చెప్పుమ ?
అట్టు లరుదెంచినట్టినా ♦ యతిథిముందుఁ
బాత్ర సంపూర్ణజీవిత ♦ పాత్ర నిడుదుఁ;
బంప నేవట్టిచేతులఁ ♦ బంప నతని.
నాదుదినములు కడఁగన్న ♦ నాఁడు వచ్చి
నాదువాఁకిలి నామర ♦ ణంబు దట్ట
శీతదినముల వేసంగి ♦ రాతురులను
గన్న మధురఫలంబుల ♦ గారవముల
నెంతయును శ్రమ నేఁగన్న ♦ యెల్లసిరులఁ
బొందుగాఁ గూర్చి యాతని ♦ ముందు నిడుదు.

**91**

జీవితమునకు ఫలితార్థ ♦ మై వెలుంగు

మరణమా! చెవి గుసగుస ♦ మాటఁ జెప్ప
రమ్ము; తడవేల మరణమా! ♦ రమ్ము రమ్ము!
అర్థి నీకయి వేచితి ♦ ననుదినమ్ము;
నీకొఱకె యుంటి సుఖదుఃఖ ♦ నిచయ మోర్చి;
నాయవియు నేను నాయాశ ♦ నాదుప్రేమ
మన్నియును నిన్నెకూర్చి గో ♦ ప్యముగఁ బాఱె;
నొక్కపరిఁ దుది నఱజూడు ♦ మోమరణమ!
నీవశంబయి పోవునా ♦ జీవనమ్ము.
లీలఁ గూర్పంగఁబడినట్టి ♦ పూలదండ
సిద్ధ మయ్యెను; వరునికై ♦ సిద్ధ మయ్యె.
పెండ్లి కాఁగానె వధువు సం ♦ ప్రీతి రాత్రి
నేకతమ్ముగ నెవ్వరి ♦ దృష్టిఁ బడక
నిలయమును వీడి ప్రభువుతోఁ ♦ గలిసికొనును.

92

పాయు నిబ్బాఖి నాదృష్టి ♦ పథమునుండి
యొక్కనాఁడని తెలియుదుఁ ♦ జక్కగాను.
ప్రాణ మాజ్ఞను గైకొని ♦ మౌనముగను
బోవుఁ దుదితెర నాకండ్ల ♦ముందుఁ బఱపి;
కాని చుక్కలు రాత్రిలఁ ♦ గాచు విడక
వేకువయు నెప్పటట్టులు ♦ వేగుచుండు

జెలఁగు నలలట్లు కాలంబు ♦ చేరి చేరి
చల్లుచుండును సుఖదుఃఖ ♦ చయము సతము.
ఇట్టి నాయంతమును మది ♦ నెంచినపుడు
కాలమందలియవధి నా ♦ కనులు వీడి
మరణమనుకాంతిఁ గైకొని ♦ మహిని గాంచు
లీలఁ జల్లినసీభాగ్య ♦ జాలములను.
మరణ మవధిగ నెంచెడు ♦ మనసుకంటెఁ
బరమనీచము తుచ్ఛము ♦ మరియుఁ గలదె ?
వ్యర్థముగ నేను దమిఁ గోరి ♦ నట్టివెల్ల
నేను గాంచినవెల్లను ♦ బోనిపోని !
ఏవతో లక్ష్యపెట్టని ♦ వెల్ల నాకు
రాని సత్యముగాఁ దొల్ప ♦ రాని రాని !

## 93

సెలవుఁ గాంచితి నిఁకను మీ ♦ సెలవుఁ గొందు
నేన లిడి పంపుఁ డిదె మీకు ♦ శిరము వంచి
బయలుదేరుచు నున్నాను ♦ భ్రాతలార !
తలుపు తాళము లివె కొండు ♦ దయదలిర్ప
నింటిపై స్వత్వ మెల్ల నే ♦ నెడలినాఁడ;
వినఁగ మీతుదిశుభవాక్కు ♦ వేచినాఁడ;
జరపితిని బెక్కునాళ్లు మీ ♦ పొరుగునందు

నిడిసదానికి మించి నేఁ ♦ బడసినాఁడఁ;
జెల్లవాతెను గదిమూలఁ ♦ దేజరిలిన
దీపమును నారె నే బైలు ♦ దేరుటకును
సిద్ధమైతిని రమ్మని ♦ చీటి వచ్చె.

94

మేలు గోరుఁడు నేవీడు ♦ కాలమందు
మిత్రులార ! మదీయస ♦ న్మిత్రులార !
ఆకసము తెల్లవాతెను ♦ నాకుఁ జూడ
నందముగఁ గానవచ్చె నా ♦ యాత్రపథము.
అటకుఁ గొనిపోవ నేమున్న ♦ దనుచు మీర
లడుగకుఁడు పైన మర్యాద ♦ నధిపుకడకు
నాశతో నిండి తోల్కాఁడు ♦ నాత్మతోడ
దద్దయును రిక్తమైనహ ♦ స్తములతోడ.
పెండ్లిహారంబు మెడను సం ♦ ప్రీతి నిడుదుఁ
బాంథువలెఁ దాల్ప నేఁగావి ♦ వస్త్రములను
తెన్నులోన నపాయంబు ♦ లెన్ని యున్న
బెదరి చెదరక యుండుదు ♦ మదిని నేను
యాత్ర ముగిసెడునంతలో ♦ నంబరమున
సాంధ్యనక్షత్ర ముదయించు ♦ సంజలోన
జాలిఁగొలిపెడుగీతముల్ ♦ సార్వభౌము.

మందిరద్వారమునఁ జెవి ♦ విందు సేయు.

## 95

కడఁగి యీజీవితములోని ♦ గడపనెప్పు
డేను దాఁటితినో నాకు ♦ నెఱుక లేదు;
అడవి నడురేయి మొగ్గవో ♦ లహహ నన్ను
వింతలో వింత యగు మహో ♦ విశ్వమందు
నేమహాశక్తి గొలిపెనో ♦ యెఱుఁగరాదు.
వేకువను గాంతి నాకన్ను ♦ సోఁకగానె
నేను లోకమ్ములోఁ గొ్రత్త ♦ గా నటంచుఁ
బేరు రూపును లేక య ♦ భేద్యుఁడైన
ప్రభువు నాతల్లిరూ పొంది ♦ పరమకరుణఁ
జేతులను దాల్చె నని తోఁచెఁ ♦ జిత్తమందు.
ఇట్లు తెలియంగఁ గాని యీ ♦ యీశ్వరుండె
చిరపరిచితుండువోలె నా ♦ మరణమందుఁ
గూడఁ గనఁబడుఁ గనఁబడుఁ ♦ గూర్మితోడ;
నిప్పు డీజీవితమ్ము నే ♦ నెలమిఁ జూతుఁ
గాన మృతిఁగూడఁ బ్రేమతోఁ ♦ గాంతు నపుడు;
తల్లికుడిఱొమ్మునం దుండి ♦ తన్నుఁ దీయ
నుత్తరక్షణమందునఁ ♦ జిత్త మలర
నెడమఱొమ్మున శాంతిని ♦ బడయుకొఱకె

పిల్ల యేడ్చుట యెఱుఁగమె ♦ పృథ్వియందు.

96

ఇజ్జగంబును వదలి నే ♦ నేగునప్పు
డనుపమానంబె చూచితి ♦ ననెడుమాట
వీడుతఱిఁ జెప్పుమాటయై ♦ వెలయుఁగాత !
కాంతి వార్ధిని వికసించు ♦ కమలమందు
నున్న తేనెను నేఁజవిఁ ♦ గొన్నవాఁడ
నహాహా ! ధన్యుఁడ ధన్యుఁడ ♦ ననెడుమాట
వీడుతఱిఁ జెప్పుమాటయై ♦ వెలయుఁగాత !
అంతమే లేనిరూపంబు ♦ లమరి యుండు
నీవిలాసాలయంబున ♦ నెలమి నాడి
మించినాఁడ నరూపుని ♦ గాంచినాఁడ
స్పర్శకందనివాఁడు పరి ♦ సన్నమూర్తి
యంటెఁ గావున నాదుస ♦ ర్వాంగములును
దేహమెల్లను గగుర్చి ♦ తేజరిల్లె
నంత మిటఁ గల్గఁ గల్గని ♦ యనెడుమాట
వీడుతఱిఁ జెప్పుమాటయై ♦ వెలయుఁగాత !

97

నిన్ను జతఁగూడి నేనాడు ♦ చున్ననాఁడు

నిన్ను నెవఁడని నేను బ్ర ♦ శ్నింపలేదు;
సిగ్గు వెఱపుల నెఱుఁగక ♦ చెలఁగుచుంటి;
జీవితం బెల్ల గజిబిజిఁ ♦ జెంది యుండెఁ;
గేవలము స్నేహితునివలె ♦ దేవ! నీవు
వేకువను లేపుచుంటివి ♦ వింతగాను.
పఱచినడుపుచు నుంటివి ♦ వనపథముల.
ఆదినములందు నీచేయు ♦ నందమైన
గానములలోనియర్థంబుఁ ♦ గనుగొనంగ
నాకు నింతయు లక్ష్యంబు ♦ లేకయుండె.
మట్లుమాత్రమె గ్రహియించె ♦ మద్గళంబు
నాట్య మాడెను లయఁ గొని ♦ నామనంబు.
ఆట నంతయుఁ జాలించి ♦ నప్పు డిప్పు
డహహా! తటుకునఁ గనఁబడు ♦ నది యిదేమి?
సద్దుసేయనినక్షత్ర ♦ సమితిఁ గూడి
జగము కనులను వాల్చి నీ ♦ చరణములను
నద్భుతంబుగ నిలఁబడె ♦ నద్భుతముగ.

98

నాదుభంగమ్ము దాల్చుహా ♦ రాదికములఁ
బొంకముగ నేను నిన్ను న ♦ లంకరింతుఁ;
బరిభవమునుండి తప్పుకో ♦ బలము లేదు.

గర్వభంగము నాకగుఁ ♦ గల్లగాదుః
బంధములు తెగు నెంతయు ♦ బాధ నొసఁగి
వేఱుగతివట్టి నామది ♦ విడుచునూర్పు
గట్టిఱాయియుఁ గన్నీటఁ ♦ గరఁగిపోవు.
నిచ్చలుఁ శతపత్రము ♦ విచ్చుకున్నా?
దానితేనియ తప్పక ♦ తరలి పాఱు
నీలముగ నింగినుండి తా ♦ నిక్కి చూచి
కన్నొకటినాకు రమ్మని ♦ సన్నసేయు;
మిగుల దేమియు నాదేమి ♦ మిగులకుండుఁ;
గందు మరణంబు నీపాద ♦ కమలమందు.

## 99

నాశిరస్త్రాణమును దీసి ♦ నాథ! యిడిన
దాని ధరియించుటకు నీకుఁ ♦ దరుణ మగును.
కాఁగ నున్నది యగును ♦ దక్షిణమునందె
వ్యర్థ మీనాదుపోరాట ♦ వ్యర్థ మయ్యె!
స్వాంతమా! చేతులను దీసి ♦ చప్పు డుడిగి
యోటమికి నోర్చి యుంచిన ♦ చోట నీవు
పరమశాంతిని నుంట లా ♦ భంబటంచు
నెంచుమా నాదుహృదయమా ♦ యెంచుకొనుమ.
అట్టె వీఁచినగాలికి ♦ నారి యారి

పోవుచుండెదు నాదీప ♦ ములను వెలుగఁ
జేయ మాటికి యత్నించు ♦ చేతలందు
మఱచుచుండుదుఁ దక్కిన ♦ మాటలెల్ల.
కాని యిఁకఁ దెల్వినొనరింతుఁ ♦ గార్య మేను
జీఁకటిని నేలఁబఱచి నా ♦ చిన్నిచాఁప
వేచియుండుదు నీకయి ♦ వేచియుందు
ప్రభువతంసమ! నీయిచ్చ ♦ వచ్చినపుడు
రమ్ము కూర్చుండు మిట నీవు ♦ నెమ్మదిగను.

## 100

రూపమే లేక పూర్ణమై ♦ రూఢిమెఱయు
ముత్తెమును గాంచుకొఱకు నై ♦ మునుఁగుచుందు
లోఁతుగా రూపవారిధి ♦ లోన నేను;
వాతహతమైనయీనాదు ♦ పడవ నెక్కి
రేవురేవున కేనిఁకఁ ♦ బోవఁ బోవ.
అలలపై లేచి పడి యాడు ♦ నాదినములు
గడచి నేఁటికి నెంతయో ♦ కాల మయ్యె.
మరణమేలేనిదానిలో ♦ మరణ మంద
వేడ్కతో నుంటి నుంటి నే ♦ వేడ్కతోడ.
నాదుజీవితమనువీణె ♦ మోదమునను
గా)లుచుండునగాధమా ♦ ర్గమ్మునందు

శబ్దమే లేనితంతుల ♦ చారుగాన
రసము పొంగుమహాస్థాన ♦ రంగమునకు
దీసికొనిపోదుఁ దప్పక ♦ దీని నిపుడు.
నిత్యమను పాటలో దీని ♦ నెమ్మిఁగూర్తు;
దీనికడసడియూపిరి ♦ తీఱినపుడు
మౌనముగ నుండునీవీణె ♦ మౌనికాళ్ల
కప్పగింతును దప్పక ♦ యప్పగింతు.

## 101

దేవ! యెప్పుడు నేను నా ♦ జీవితమున
నాదుగీతాళిచేతనే ♦ నాథ! నిన్ను
వెదకుచుంటిని దప్పక ♦ వెదకుచుంటి.
ఇంటి కింటికి నన్నవి ♦ యెలమిఁ జేర్చె
వానితో నుండుటను నాపరి ♦ పంచ మెల్ల
వెదకి యంటినయట్టులు ♦ మదికిఁ దోఁచె.
నేను నేర్చినపాఠము ♦ లెల్లనాకు
నవియె నేర్పెను దప్పక ♦ యవియె నేర్పె;
నెన్నియోగూఢమార్గమ్ము ♦ లెఱుఁగఁజేసె.
అంతరాకాశమందున ♦ నలరుచుండు
నెన్నియోచుక్కలను నాదు ♦ దృష్టిముందు
నవియె పెట్టెను దప్పక ♦ యవియె పెట్టె.

మోదఖేదంబు లొప్పెడు ♦ భూమిలోని
వివిధచిత్రమ్ములను జూప ♦ వేడ్కతోడ
నవియె నడిపెను దప్పక ♦ యవియె నడిపె.
తుదకు యాత్రాంతమున సంజ ♦ యొదవినప్పు
డేప్రభుద్వారమున నవి ♦ యెలమిఁ జేర్చె?
నేప్రభుద్వారమున నవి ♦ యెలమిఁ జేర్చె?

## 102

కాంచితిని నిన్ను నేనని ♦ గర్వపడితి
మనుజులందఱిలోపల ♦ మహిని; గాన
వారు నాకార్యముల నెల్లఁ ♦ బ్రభువతంస !
నీదుచిత్రమ్ములే కాంచి ♦ నెమ్మితోడ
నాతఁ డెవఁ డని వచ్చి న ♦ న్నడుగుచుంద్రు.
ఏమిచెప్పంగవలయునో ♦ యెఱుఁగఁ గాన
నహహా ! నేఁజెప్పలే నని ♦ యనిన నన్ను
దేవ ! నిందించి నిరసించి ♦ పోవుచుంద్రు;
కూరుచుందువు చిఱునవ్వుఁ ♦ గూడి నీవు.
నిన్నుఁగూర్చిననాకథల్ ♦ నింపుచుందు
నిత్యగీతాళిలోపల ♦ నింపుచుందు;
నాత్మ దాఁగక యీరహ ♦ స్యంబు వెలికి
వెల్లిగొన వారు వచ్చిమా ♦ కెల్ల దీని

యర్థ మంతయుఁ జెప్పవమం ♦ చదుగుచుంద్రు.
ఏమిచెప్పంగవలయునో ♦ యెఱుఁగఁ గాన
నర్థమెఱిఁగినవా రెవ్వ ♦ రనిన నన్ను
దేవ! నవ్వుచు నిరసించి ♦ పోవుచుందు;
కూరుచుందువు చిఱునవ్వుఁ ♦ గూడి నీవు.

## 103

నాథ! యొకవందనమ్ముతో ♦ నాకు నున్న
యింద్రియములెల్లఁ బురివిచ్చి ♦ యిజ్జగంబు
నంటుఁ గావుత నీచర ♦ ణాబ్జమందు!
నాథ! యొకవందనమ్ముతో ♦ నామనంబు
నీరముల నిండి కురియని ♦ నీరదంబు
నింగిలో శ్రావణమ్మున ♦ వంగినట్లు
వంగుఁగావుత నీమహా ♦ ద్వారమందు!
నాథ! యొకవందనమ్ముతో ♦ నాదువివిధ
గతుల గీతమ్ములెల్లను ♦ గలసియేక
పూరమై శాంతవారిధిఁ ♦ జేరుఁగాత!
గూండ్ల కరుగఁగ మనసులోఁ ♦ గోర్కెపుట్టి
పర్వతంబుల నుండెడు ♦ పట్టులకును
రేయిపవలును వదలక ♦ పోయిచేర
నరుగుచుండెడుబకపాళి ♦ యందమునను

దేవ! యొకవందనమ్ముతో • జీవన మిది
యయ్యనంతాలయముఁ జేర • నరుగుఁగాత!

## గద్య.

ఇది శ్రీపరమేశ్వర కరుణాఫలిత లలితకవితాకలిత శ్రీ
రామలక్ష్మాంబా బుచ్చివేంకయామాత్యతనూజాత
సకలసజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథ
నామధేయప్రణీతంబయిన
గీతాంజలి
సంపూర్ణము.



# శుద్ధపత్రిక.



| పుట. | పఙ్క్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 6 | నూతనానంద | నూతనానంత |
| 6 | 12 | లేని | వేని |
| 5 | 1 | వాఁకిట | వాకిట (నంతటనిల్చే) |
| 0 | 2 | బుద్ధియా | బుద్ధియో |
| | 10 | ,, | ,, |
| 0 | 17 | నెవ్వుడు | నెపుడు |
| 2 | 3 | రేయుంబల్లు | రేయుంబవల్లు |
| 5 | 5 | జిమ్ము | జిష్ణు |
| | 18 | యయు | యయి |
| 8 | 19 | సోమరితము | సోమరితనము |
| 2 | 14 | బాంధువలె | బాంధువలె |
| | 6 | మహాక్తి | మహాశక్తి |

వ పుట 7 పఙ్క్తి తరువాత

సేవలోఁ బ్రేమ ఫలియింపఁ ♦ జేయునట్లు
కూర్మితో దయసేయుము ♦ గొప్పబలము

పఙ్క్తులను జేర్చి చదువవలయును.

# ఆంధ్ర రఘువంశముపై

## బుధజనాభిప్రాయములు.

---

**I.** బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు.

దయాపూర్వకముగా నాకొసంగఁబడిన భవదాంధ్రీకృత 'రఘువంశము' లోఁ గొన్నిభాగములు చదివి యానందించితిని. చదివినంతవఱకుఁ బద్యములు మనోహరములుగను నిర్దోషములుగను సుబోధములుగ నున్నవి.

మూలగ్రంథశ్లోకములుగూడఁ బ్రక్క నచ్చొత్తించుట కడునుపయోగకరముగ నున్నది. చాలవఱకుపజాతిపద్యములలోఁ దెనిఁగించుటవలన నిరర్థకపదము లెక్కుడనోకాని కానరాకుండ మీపుస్తకము మూలగ్రంథానుసారముగ నున్నది.

కవిపుంగవుఁడగు కాళిదాసు కవితాపాయసము, సముచితపాత్రమునఁ దెలుఁగువారికి విందిడి వారికృతజ్ఞతావందనములకుఁ బాత్రులైనారు.

ఇది పాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగ నేర్పఱచుట కన్నివిధముల ననుకూలమై యున్నదని నాయభిప్రాయము.

పిఠాపురము. }
23-7-13. }

ఇట్లు విన్నవించు భవన్మిత్రుఁడు,
కూచి నరసింహము.

---

**II.** బ్రహ్మశ్రీ పురాణం నాగభూషణంగారు.

తమయాంధ్రరఘువంశము మిగుల రమణీయ మగుకావ్యము. సంస్కృత

కవిసార్వభౌముఁ డగుకాళిదాసునిరఘువంశము దెనిగించి మీరాంధ్రలోకమునకు మహోపకార మొనర్చితిరి. సంస్కృతకావ్యములలో వాల్మీకిరామాయణము, కాళిదాసరఘువంశము మిగులసులభముగ నున్నట్లగుపడినను జదివినకొలఁదిఁ గవిహృదయము దెలిసి గ్రంథకర్తలయసదృశప్రజ్ఞావిశేషము దేటపడును. మూలమం దుండురసమునకు, గాంభీర్యమునకు భంగము కలగకుండ తాముసులభశైలిని దెనిఁగించఁ గలిగితిరి. ఈయాంధ్రరఘువంశము బాలురచేతను స్త్రీలచేతను జదివించినయెడల వారికి బుద్ధి వికసించును. మనస్సున కానందము కలుగును. మీయాంధ్రరఘువంశ మాంధ్రవాఙ్మయములో శాశ్వతముగ నుండదగుగ్రంథమగుటంజేసి యాంధ్రదేశీయులు మీగ్రంథమును దగినట్లాదరింతు రనినమ్ముచున్నాను.

పురాణం నాగభూషణం.



## III. బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు.

అయ్యా! మీరు స్నేహపూర్వకముగా నంపినయాంధ్రరఘువంశమును సావధానముగాఁ జదివి మిగుల సంతసించితిని.

ఆకావ్యము మిక్కిలి మనోహరముగను సలక్షణముగను మూలానుసారముగను నున్నది. కాళిదాసునికవిత్వమాధుర్యము బయల్పడునట్లాగ్రంథమును సుబోధమగుపద్యకావ్యముగాఁ దెనిఁగించు టాంధ్రలోకమున కుపకారముచేయుట యనితలంచెదను. మఱియు నందు మూలము సయితము ముద్రింపించుటచే నాపొత్తము సంస్కృతముచదువంగోరువారికి నుపకరించును.

చిత్తగింపుఁడు.

తాపురము.
17-8-13.

విధేయుఁడు,
పురాణపండ మల్లయ్యశాస్త్రి.

## IV. బ్రహ్మశ్రీ దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశ రావుగారు.

తాము దయాపూర్వకముగఁ బంపినఆంధ్రరఘువంశమును శ్రద్ధతోఁ జదివి యపరిమితానందముఁ బొందితిని. శ్లోకమును దానికెదురుగ భావపూరిత మైన తెలుగుపద్యమును కలిపి ప్రకటించుటవలన జదువరులకుఁ గలుగుచున్నలాభమవర్ణనీయము. సంస్కృతజ్ఞానలవము గల్గి, తెలుగుకావ్యసారము గ్రహింపగలవారెల్లరును మీభాషాంతరీకరణమున మూలమునందలిసారము, భావము, గంభీరము, మార్దవము లోనగున వొకట్టియైన తొలగిపోక కడురమ్యముగను హృద్యముగను మీకావ్యము రచింపబడె ననినిష్కల్మషముగఁ బల్కక తీరదు. తేటగీతలలో మూలమునందలిరసమునంతయు నిముడ్పజాలినమీప్రజ్ఞ స్తవనీయము. నేను కవిని, పండితుడఁను గాకున్నను శ్రోత్రపేయమై మనోరంజకమై నిర్దుష్టముగ నున్నమీ భాషాంతరీకరణమునకు నాయీయభిప్రాయమును విన్నవింప సాహసించినందుకు మన్నింతు రనినమ్ముచున్నాను.

కాకినాడ.<br>24-8-1913.

చిత్తగించవలెను,<br>దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశ రావు.



## V. బ్రహ్మశ్రీ రామకృష్ణకవులు.

మీయాంధ్రరఘువంశముం జదివినారము. మృదుమధురశైలితో మూలానుసారముగా నొప్పుచున్నది. పీఠికలోఁ దులనార్థ ముదాహరింపఁబడిన కీచయ్యగారిరఘువంశములోనిపద్యములు కొన్నిచోట్ల సమీచీనపాఠములు దొఱం యున్నవి. "ఉన్నతమర్త్యలభ్యఫల" మనుటకుబదులుగా "నున్నతమర్త్యలభ్యపద" మని యున్నది. ఇట్లే మఱికొన్నియుఁ గలవు. పరిష్కృతమై ప్రతినుండి యందలిపాఠములను రెండవకూర్పులోఁ సవరింపఁ గోరెదము. శ్రీక

...రాయచరిత్రము మున్నగు గ్రంథములు వ్రాసి పేరుపడిన మీయాంధ్రము వేఱ పొగడ నక్కఱ లేదు.

పిఠాపురము.

చిత్తగింపవలెను,
రామకృష్ణకవులు.



## VI. బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారావుగారు.

తమరు రచియించిన ఆంధ్రరఘువంశము కొంతకొంత చూచితిని. మూలమునకు సరిగాను ఇంపుగాను చక్కఁగా నున్నది. శైలి సరళమై యున్నది.

మీయట్టివారు వ్రాసినదానియం దెట్టిలో టుండఁ గలదు. అంధ్రిగ్రంథమును మాత్రము ప్రత్యేకముగ ముద్రించినయెడలఁ బాఠశాలలయందుఁ జదువు బాలురకు వినియోగింప వచ్చునని తోఁచెడి. ఆలస్యము క్షమింపుఁడు.

తిరువళిక్కేణి.
31-8-13.

ఇట్లు విన్నవించు భవద్విధేయుఁడు,
వా. సుబ్బారావు.



## VII. బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజుగారు.

మీరు దయాపూర్వకముగ నంపిన "ఆంధ్రరఘువంశపద్యకావ్యము" ను …వి యమితానందభరితుఁడ నయితిని. మహాకవి "కాళిదాసు," ఆంగ్లేయ …పుంగవుఁ డగు "షేక్స్పియరు" నకు సమానుఁ డనికొందఱును, అనేకవిధ …ల నాతనికంటె నెక్కుడువాఁ డనికొందఱును జెప్పుదురు. పృథివియందు మానాధికరహితుఁ డగుకవి యీతఁడొకఁడే యనుట యనేకులయభిప్రాయ యున్నది. అట్టివిఖ్యాతిఁ గాంచినకవిశ్రేష్ఠుఁడు గీర్వాణభాషయందు విద్యా

ర్థులకే కాక పండితులకు సయితము లోకజ్ఞానము లెస్సగఁ గలుగుపాంటె రచి యించిన రఘువంశమహాకావ్యము కావ్యములలో మేలుబంతి యనఁదగి యున్నది. చిరకాలమునుండి నేఁటిదనుక సంస్కృతవిద్య నభ్యసింపఁగోరువారి కెల్లకును బుస్తకరూపమున నుండెడిగురువు ప్రప్రథమమునఁ గాళిదాసే యగుచున్నాఁడన నాతనినిగాని యమ్మహాకవికిఁ దాదృశమైనచిరయశస్సు సంపాదించుచుండుప్రథమకావ్య మగురఘువంశమునుగాని యేమని పొగడఁ గలము?

అట్టి యమూల్యకావ్యమును సంపూర్ణముగఁ దెలిఁగించి యాంధ్రలోకమునకు మీరు మహోపకార మొనరించి యున్నారు. ఏతాదృశమహాకావ్యము లింకను మీరు చేయునట్లు సకలజగత్కర్త యగుపరమేశ్వరుఁడు మీకు నాయురారోగ్యానందంబుల నొసంగుఁగావుత మని ప్రార్థించు చున్నాఁడను.

ఈగ్రంథమునందలి మీపద్యములశైలి మిగుల ధారాళముగను, మృదుమగను, రసవంతముగను, మనోహరముగను నున్నది. మఱియు సంస్కృతమున శ్లోకము లెట్లు మృదుమధురముగ నున్నవో తెలుఁగున మీపద్యములును అట్లున్నవి ఆంధ్రీకరణము కడవఱకు మూలమున కన్యూనానతిరిక్తముగ నొప్పారు చున్నది పూర్వ మీరఘువంశమును దెనిఁగించిన "అవుదూరి కిచ్చయ్య" కవి యాంధ్రీకరణముకంటె మీయాంధ్రీకరణము వేవిధముల మిన్నగ నున్నది. మఱియు సంస్కృతమున నించుకంత జ్ఞానము గలవారుసైతము మీపద్యముల సాహాయ్యమున "గాళిదాస" మహాకవియొక్క సంపూర్ణాభిప్రాయములను బాగుగ గ్రహింపగలరనియు, సంస్కృతకావ్యములలో నెట్టిమహిమ మున్నదో తెలిసికొనఁగరనియు నేను దలంచెదను. వేయేల? తనకవితాసామర్థ్యము నెల్లను ఆంధ్రలోకమునకు వెల్లడి చేయుతలంపునఁ "గాళిదాస" మహాకవియే తనమహిమన మీయందుఁ బ్రవేశపెట్టి మీచే నీయాంధ్రీకరణమును జేయించె నేమో యని యూహించు చున్నాఁడను,

చిత్తగింపుఁడు.

పిఠాపురము.
28-8-13

ఇట్లుమిత్రము,
వడకుమటి వీరరాజు.

లీలఁ గనిన మెచ్చుల కా
వాలం బవు నింతకన్నఁ బలుకు లిఁకేలా ?

కాకినాడ.
25-8-13.

ఇట్లు
శృంగారకవి సర్వారాయఁడు,
కాకినాడ కాలేజీ తెలుఁగుపండితుఁడు.



## X. బ్రహ్మశ్రీ ఓలేటి పార్వతీశముగారు.

శ్రీరాజితాదిపూడికు
లారామవిలాస సురభి ♦ శౌంచన్నవమం
దారా! సారాచారా
నారతసత్కృత్యా! సోమ ♦ నాథామాత్యా!

చంపకమాలిక.

పలుకులఁ దేనె లుట్టిపడ ♦ భావము లర్థములందు విచ్చుమొ
గ్గలనెఱతావుల ట్లలరఁ ♦ గాఁ బసమించెడుతళుక్కుఁజినుక్కుపూ
సలసరులట్లు పద్యము ల ♦ సంఖ్యము, లప్రతిమానకల్పనా
లలితము, లద్వితీయసద ♦ లంకృతముల్, రుచిరప్రవృత్తముల్
సెలఁగఁగఁ గాళిదాసకవి ♦ శేఖరుఁ డుజ్జ్వలధీవిశారదుం
డలఘుతరాత్మశక్తికి స ♦ మర్హగతిన్ విరచించినట్టిని
ర్మలరఘువంశకావ్యము స ♦ మంజసరీతిఁ దెనుంగుబాసలోఁ
నలరఁగఁ జేసి మీరలు ద ♦ యామతిఁ బంపినగ్రంథరాజమి
మ్ములఁ బఠికించినాఁడ మదిఁ ♦ బొంగెడుహర్షపయోధివీచికా
కలనము నింగి నాఁడెఁ; గుతు ♦ కంబునఁ దేలినవాఁడ; భావభం
గులఁ దనివొంది నెమ్మిఁ గనఁ ♦ గోరినవాఁడ; రసానుభూతి న

స్నలమిన లోఁగి మైమఱపు ♦ నందినవాఁడ ; సవి
కలితుఁడ సై వడిం దెలివిఁ ♦ గాంచిన వాఁడ ;
స్తులవిభవంబుఁ జాఁటుటకుఁ ♦ దోరముఁ గట్టఁగ
తెలుఁగును కాళిదాసకవి ♦ ధీరునిసంస్కృతవాః
ట్టులె తగియుంట నెమ్మదిఁ గ♦నుంగడు సంతసవ
వెలివఱుపంగడంగితి వి♦వేకధురీణ! యథార్థ్వరీతి
ఫు లెసఁగ, మూల మింతచెడి ♦ పోవకయుండఁ
టల విరిదేనెతేటలమి ♦ టారము దోఁపఁగ వింత
తులవిరిసోన లొక్కపరి ♦ దోఁచినయట్టులు, పూః
కలలలరేఁగి హాయిగను ♦ గానము చేసినయట్లు, క
వ్రు లాలయఁ చిన్న తెమ్మెరలు ♦ పొందుగవీచెమః
తులరఘువంశ మాంధ్రమునఁ ♦ దోరముమీర రచి
ర్మలకవితాప్రభావగరి ♦ మంబు నుతింపఁ దరంబె

ఇట్ల

పిఠాపురము.
20-9-13

భవదీయ
ఓలేటి పా